శ్రీసర్వేశ్వరాయనమః

# నేటి ప్రపంచ యుద్ధము.

## బొబ్బిలి పాట మాదిరి.

'రామ రామ శ్రీరామా రామా రామా రఘురామ'
ప్రస్తుత మెల్లెడ యుద్ధవార్తలే, ప్రకటిత మవుచుండె
ఇతరదేశములు అల్లడతల్లడ మందుచుండె మిగులన్
సకల సంపదలు వికలమవుటకును సుఖముఁగోలుపోను
చేసినకష్టము ఫలియింపక ప్రజలెల్ల దుఃఖమొంద
యెవరికివారే యెమునాతీరే యన్నట్లాయెనుగా
దీపముండగనే తడువుకోవలెను బ్రతుకుగోరువారు
లోకమందు రష్యాదేశము భూస్వర్గమనగబడును
ఆదేశములో అల్పులనియు నధికులనియు యెరులేరు
కూటికిగుడ్డకు కొరతలేదు సంపాదన మొక్కండె
అందఱునచ్చట కోటీశ్వరులే పేదవాండ్రులేరు
ఇల్లునువాకిలి లేనివారు నాదేశమందు లేరు
పరులనునాసించుక బ్రతుకందలంచు ప్రజలందున లేరు
ఉండనిల్లును పరుండగమంచము లేనిజనులులేరు
మతమందరకును నొక్కటె యెందునవమాఱుమతములేదు

వ॥ ఇట్టివిలాసముగల రష్యాలో,

ఎల్లవారలకు నన్నిసుఖంబులు గలుగుచుండెనచట
సంపదలందఱ కొక్కరీతిగనె లభియించుచునుండున్

జనులందఱుఁ గడుఁగష్టజీవులే, సుఖముఁగోరరెవరు
ఒకఁడుసుఖంపడ నొకఁడు కష్టపడ నొప్పకుంద్రుసమత
కష్టసుఖంబుల నందఱు సమముగ ననుభవింతురచట
ఖేదమోదముల భేదమెఱుఁగరా దేశవాసులెల్ల
వాస్తవముగ రష్యాదేశ మ్మదిస్వర్గలోకసమము
లోకములోధనికులు ప్రభువులునయి పాలింపుచునుండ,
యద్భుతముయ్యెడు రష్యాసామ్యముకన్నులఁ గనుఁగొన్న
రైతుకూలీ లొక్కరీతినట నధికారులునయిరి
ఇదిసర్వోత్తమ మైనమార్గమని సన్నుతి గనెనచట
ఇది ఇట్లుండగ, పదుతొమ్మిదివందల పదునేడైన
సంవత్సరమున జనులెల్లనిక్కమును గావించిమించి
జమీందారులును పరిపాలకులును పదవులు విడిచనికి
పూర్వకాలమున నాదేశమ్మును జారుచక్రవర్తి
నిరంకుశమ్ముగ పరిపాలించెను కత్తి చేతబూని
నిష్టురఁదిండియుఁ గట్టబట్టయును ప్రజలెఱుంగరపుడు
కష్టమైనయెండలకు మాడినను నీడనిలువలేదు
ఎక్కడఁగాంచిన నాకలికార్పులె హాహాయనిపించు
ఎక్కడఁగాంచిన మూతిబిగింపులె, అంతటరోగములె
దరిద్రదేవత తాండవమాడుచు నుండెయెల్లయెడల
దానికితోడ్పడె విద్యలేమి పలుతావులయందునను
మొండివాదములు ప్రబలమయ్యెను ప్రజలందఱిలోను

వ॥ అప్పుడు జారుచక్రవర్తి యెటులుండెననిన;

తెల్లనిస్ఫటికపు రాలహర్మ్యముల జారసతులగూడి
సురనుద్రావి మత్తెక్కిసోలుచును, సుకముగోలుపోయి
కలిసౌఖ్యమ్ములె శాశ్వతమనుకొని ప్రజలమాట మరచె

జారకామినుల కనుసన్నలలో మెలకువలను గఱచె
రాష్ట్రమంతటను నిప్పచ్చరమును పెచ్చుపెరుగుచుండ
వెనుకముందర యకాకాలంబున దానుజూచుచుండె
ప్రజలు పన్నులిడుటకె కావలెనా పైనక్కఱలేదు
సౌకర్యంబుల సంగతి యప్పటివారు వినఁగలేదు
భూస్వాములకును జనసామాన్యము లొంగితిరుగుచుండ
స్వర్గసుఖముల జమీందారులు పొంగిపొరలుచుండ
స్త్రీలుంబురుషులు తనువున్మానము ప్రజలపాలుజేసి
నిజసౌఖ్యంబులు గగనకుసుమములునై వికాసమొందె
గాసిజెందికూటికిగుడ్డకు కరవై తపించుచుండె
కష్టమానవులు నందఱు నొక్కటై భూనగములదర
అందరు నేకముఖంబుగ విప్లవముగ నొనర్పసాగె
కూలిరాజ్యమని కూలిరాజ్యమని కూలిరాజ్యమనుచు
కేకలువేయుచు పరిపరివిధముల ధైర్యసాహసముల
జారుమొదలుగాగల భూపతులను క్రిందపెట్టినారు
స్వరాజ్యపతకము రాష్ట్రమంతటను స్థాపించిరి ప్రజలు
మానవులందరు నొక్కటియేయను పృంథభావమునిల్పి
సర్వవిధంబుల సమభావంబును చక్కబరచుకొనుచు
సాంఘికమ్మును రాజకీయములు ఆర్థికములు నొక్కటై
లక్ష్మీవంతులు కొట్టులునింపిన సర్వధనమ్ములును
సర్వసంపదల ప్రజాప్రభుత్వము ప్రజలపాలుజేసె
భోగవంతుల భోగములన్నియు నీటగలసిపోయె
సామంతుల సర్వాధికారములు చేలగడ్డిమేసె
రాజపుత్రుల రాజసమంతయు ధూళిగలసిపోయె
సామాన్యులు పలుసౌఖ్యములందుచు సంతసిల్లుచుండె

యీవిభవముగని ధనికరాజ్యములు నీర్ష్యబూనియుండె
మహదైశ్వర్యముగూడియుండెను రష్యారాజ్యమ్ము
అప్పటి ప్రపంచపద్ధతియేలా పరిణమించెననిన
ప్రపంచయుద్ధము ముగిసిపోయెను శాంతియయ్యె జగము
అన్ని దేశములు తీరికగాంచెను ప్రజారాజ్యమందు
రష్యాలోపలధనికులుక్రుంగుట సుఖము పెరిగెనుట
జరిగెనేని తమబలములు నాగతి తమ్ముద్రోతురనుచు
లోలో దెలుసుకగలని యోచనలు జేసిరిధనవంతుల్
అందరు నేకంబై ప్రకాశముగ గూడియుండిరచట
వ॥ ఇట్లుండగా.
జర్మని, జపాన్, ఇంగ్లండ్, ఫ్రాన్సు, అమెరిక పోలెండు
ఇటలీమున్నగు రాజ్యమ్ముల దండులన్ని వెకలి
రష్యాపై నొకప్పెట్టుగ పడిరను నచ్చట ప్రజలపుడు
క్రొత్తశాంతియును క్రొత్తబలంబును ఉద్రేకముజూప
వ్యష్టియసమిష్టియును మతరికిగల నాయుధములగాను
సాధారణజనముల వీక్షణములె తమకురక్షగాను
స్వతంత్రవృత్తియు సర్వసామ్యతయు ఉద్రేకముగొలుప
ధైర్యసాహసంబులు నెల్లప్పుడు తమ్ముప్రోత్సహింప
రెండేండ్లుదనుక హోరాహోరీ పరాక్రమంబు జూపి
ధనికస్వాములపరివారంబును సమరభూమినిమిమి
ధైర్యంబెడలగధనికులనెల్లెడ సాహసమున దరిమి
రాజ్యముభోజ్యము తమవెయటంచును నిశ్చయంబుగాగ
విజయనాదమెల్లెడలమ్రోగగను రష్యా రహింమించె
పరరాజ్యమ్ముల సైన్యములంతట జడిసిపారిపోయె
వ్యష్టిమెంతమాత్రముదలపోయక సమిష్టిమార్గమున

సమిష్టివృత్తియు సమిష్టిఫలితము సమత్వమున బొంది
జనులసుఖమ్మును జనులజ్ఞానమును జనులనాగరికతను
కళాభివృద్ధియు కళాపోషణము సమత గలుగగాంచి
వెలుచుండిరి పరులెల్లరు మెచ్చగ రష్యాదేశమ్ము
ప్రపంచమున యీరష్యారాజ్యమె ప్రజలరాజ్యమనుచు
వాసికెక్క భూలోకమందున ఓడినరాజ్యములు
తాపవస్థానలు వంకల బర్వగ నీర్ష్యలోనబూని
ప్రజలరాజ్యమును బడద్రొబ్బుటకును వేచియుండెనంత.

వ॥ ప్రపంచమంతా యీలాగుంటుండగా 1918లో ఓడిపోయి వర్సైయిల్సు సంధితో శిథిలమైపోయిన జర్మనీ తనపోయినసామ్రాజ్యాని తిరిగి సంపాదించుకొనవలెనని—

మరఫిరంగులు మరతుపాకులు టాంకులు మోటార్లు
సబ్మెరైనులు, యుద్ధనావలు డిస్ట్రాయర్లెనో
విమానములు జలవిమానములు బాంబులును ఫైటర్లు
గుర్రపుదళములు కాల్బలమ్ములును యాంత్రిక సైన్యములు
ఆ ఆయుధముల కంతులేదు మఱియడ్డమేమిలేదు
మహాగంభీరమయినజలధివలె సేనపెరిగిపోయె
బ్రిటను మొదలయినవి జేతదేశము లేర్పఱచినయట్టి
వర్సైయిల్సు సంధిపద్ధతులను గెంటియవలఁబెట్టి
వివిధాయుధముల తయారుచేసుక సైన్యములనుగూర్చి
పరరాష్ట్రంబుల నాక్రమించుకొను నాశయమున బొంగె

వ॥ అట్టి సమయంబున

జర్మనుప్రభువుల సామ్రాజేచ్ఛల సంతరించఁబూని
అనాగరికుఁడును అనామకుండగు హిట్లరు పనిఁబూని

హస్తగతముగా జేసుకొనియె నా యధికారంబెల్ల
జర్మనులను మరల నుద్ధరించెదఁ గనుగొనుడనెను
పరులుహరించిన సామ్రాజ్యమ్మును బొందగలముమేము
లోకమంతయును బ్రతిధ్వనింపగ జయము నొందగలము
చేరండుమీరనెడివాక్యమే జయచిహ్నము సుమండీ
చేరరరండు మీరనెడిమాటయే ధీరవృత్తహాను
కూడులేక గుడ్డయులే కల్లాడనాథ జనులార
సేనగలియుడీ విజయము బొందుడి నిపుచ్ఛరముడుగు
అని యనేకవిధముల నీతీగున బ్రిజ్ఞలను నమ్మించి
తప్పుమార్గముల బడద్రోసెను నీలాగుబోధచేసి,

వ॥ ఇట్లు 1933 సం॥ రంలో హిట్లరు జర్మనీకి సర్వాధికారియయ్యెను. క్రూరాతిక్రూరులయిన అతని యనుచరులుకూడా అధికారులైనారు. ఇంక నతడు చేసిన కృత్యములేవియనగా—

ప్రజోద్యమములను ప్రజాధికారుల పగులగొట్టినాడు
తగిన విధంబుగ ధనికవర్గమును మఱిమఱి కొండాడె.
కార్మిక కర్షక కష్టజీవులగు జనుల నణగద్రొక్కి
వైజ్ఞానికులను మతకర్తల తనరాష్ట్ర మెడలగొట్టె
తన విధానమును తన యధికారము స్వేచ్ఛజరుగగాను
కమ్యూనిష్టుల కర్మకారులను స్త్రీలను శిశువులను
జాలిలేక గొంతుకలుగోసెను, కటికివాని విధము
చక్కని స్త్రీలగు పడినను వారల చెఱచివేసినాడు
ఒకరికొకరు కాకుండజేసెను తల్లిని పిల్లలను
ఆలుమొగలకేకాంతముమాపెను కండ్లను బడకుండ
తెలివితేటలను బూడిదలోపల కలిపివేసినాడు

జనుల తలంపులను జనులభివృద్ధిని యడ్డగించినాడు
రెచ్చగొట్టె నీప్రజలనందఱను దేశభక్తిమిషను
పరరాజ్యమ్ముల నాక్రమించుడని మఱిమఱియన్నాడు
వెనుదీయకు దీవెనుదీయకు దీరాజ్యక్రమణమున
ఇప్పటికే బహురహస్యమ్ముగను కమ్యూనిష్టుపార్టీ
పాటుపడుచునున్నది ప్రజసమ్మతి కొల్లబెట్టబట్టి

వ॥ అప్పు డిట్లరు ఆవిధమంతయు నేకాంతమున నిదానించి గ్రహించి—

కమ్యూనిష్టుల చంపివేయఁగా నాజ్ఞయిచ్చినాఁడు
బుద్ధిమంతులను గాల్చిచంపఁగా సెలవుయిచ్చినాడు
రాజ్యములోగల ఆర్థికవ్యయమును సైన్యముగూర్చుటకై
వ్యయపరిచాడు దారిద్ర్యముచే ప్రజలు కృంగియుండ
సంగరంబులకు ప్రాయపువాండ్రను హెచ్చరించినాడు
ఆయుధముల నద్భుతముగఁ బట్టగ అమలుదెచ్చినాఁడు
జర్మనిప్రజలపుడన్నవస్త్రములులేక చొక్కుచుండి
చాటుగమాటుగ స్వాతంత్ర్యము తమకేమూలనులేక
ధనవంతులకోర్కెల కాహుతియై తమ్మదాముగనక
అంతములేని మహావస్థలబడి దిక్కుదెసయులేక
కమ్యూనిష్టుల బోధలవల్లను కండ్లువిప్పినారు
సత్యమసత్యము నెమ్మదిలో గ్రహించ నేర్చినారు

వ॥ ఇక్కడ యిది యిట్లుండగా—

ప్రస్తుతమందున భూలోకములో రష్యారాష్ట్రమ్ము
స్వర్గతుల్యమును సకలసౌఖ్యముల కాటపట్టుసుమ్ము
ఆదేశమునం దల్పుడనియును నధికుఁడనియులేరు

పేదయటంచును భాగ్యవంతుడని భేదముగారాదు
కుడువ నన్నమును గట్టబట్టయును లేనివాడుఁలేడు
వుండగనిల్లు పరుండగమంచము లేనివాఁడులేఁడు
ఆదేశములో శోధించిచూచిన కడుపేదవాఁడులేఁడు
అనిపలురీతుల నచ్చటిముచ్చటలు నచటిధర్మములును
నచటసౌఖ్యములు, నచటిసామ్యములు నెచటగారావు
పేదకుపెన్నిధిలభించినట్లుగ తమనునంబులలర
ఆకోనమెతమకచ్చుబాటనుచుఁజూచుచునుండిరోగిన్

వ॥ వారీవిధంబుగ సంతోషానుత్త చిత్తులరై విహరింపు చుండ, నట్టిసమయమందులో హిట్లరు, తనబలముల నన్నిటి గూర్చుకొని ఇతరదేశాలను, ఇతరసంపదలను పరిగ్రహింప బూనినవాఁడై —

ధరను దిద్దిరను దిరుగబలములను వేగనడిపినాడు
మెమెలూ, సార్లాండ్, రైన్లాండుల దానాక్రమించినాఁడు
జకోస్లవేకియ సంగతివినఁగాఁ ప్రపంచముడికింది
జకోస్లవేకియ ప్రజాసామ్యమున పదపడియెదిరించె

వ॥ జెకోస్లోవేకియాలోని తనజర్మను దేశస్థులకు అన్యాయముజరుగుచున్నదని విని హిట్లరు కారాలూ మిరియాలు నూరాడు, ఇదిగోదండయాత్ర చేస్తానన్నాడు. అప్పుడు బ్రిటిష్ ప్రధాని చేంబర్లేను ఏంచేసాడు అంటే.

మంచివానివలె రాజీపద్ధతి జేయవచ్చినాడు
జకోస్లవేకియసర్వము హిట్లరు హస్తమునుంచినాడు
జర్మనుదానవ సైనికచక్రము చేరియుండె నచట
ప్రజవాచార్యుల మన్నిదిక్కులను పిక్కటిల్లగాను
చూరగొనినయిండ్లను జెఱచిన స్త్రీలను గణింపరాదు
హిట్లరుదుర్మార్గం బింతంతని చెప్పనలవికాదు

వ॥ అప్పుడు రష్యా ఫాసిజాన్ని నాశనంచేయడానికి, ఇంగ్లాండుతో పరస్పర సహాయసంధిని సూచించినది. ఇంగ్లాండు దాని నిరాకరించింది. ఇంతలో జర్మనీ బ్రిటనును ఉల్లంఘించి పోలెండుమీద పడడానికి సిద్ధమైనది. అప్పుడు రష్యానియంత స్టాలిన్ యేమన్నాడంటే.

మనమందఱమును ననుకూలముగా గలసి మెలసి యుండిరి
ఇతరరాజ్యముల సాహాయ్యంబు బొందిజర్మనీని
ఫాసిజమును కడముట్టించుదమింక జగమునందుశాంతి
ప్రబలును నిలబడు ప్రమాదములు దిగి, ప్రజలుసర్వగతుల
ఆశలుల కింగ్లాండు ప్రభుత్వము, గడచిపోయెననియె
దూరమ్ముగ రష్యానటనుంచగా చాలవిచారించె
రాజీలంచును రాయబారులని కాలముగడుపుచును'
తేటపడినదియుం దేలపడనిదియు గానంగరాకుండె
సమయమిదేయని హిట్లరు రష్యానేస్తమ్మునుగోరె
మీరాష్ట్రీకు మేమాక్రమించము, మారాష్ట్రముమీరు
అటుముకొనక నుండుటయె సంధియని వర్తమానమంపె,
కారణముండక వైరమేలయని రషియదానికొప్పె
సరేయనుచు హిట్లరు సంతసమున మింటికెగిరినాడు
నిరాయుధమ్మగు పోలెండుపయిన్ ధూంకుషూకినాడు
సింగినెల్లెడల విమానములతో నింపివేసినాడు
కత్తిదూసెను నిరాయుధులపై కరుణయింతలేక
టాంకుల నడకల నడవులన్నియును కప్పగూలి పడగ
కాల్బలమును గుఱ్ఱాలదళమ్మును యంత్రసైన్యములును
నేల యీనినటులుండె నాకసము వగుల జయోర్భటులు
చెలంగె నన్నిదిక్కులు నింతగ నాసమయామందు నచట!

పట్టణంబులును పల్లెలు సర్వము రూపుమాసిపోవ
ఉన్నమట్టుకు బలముగూర్చుకొని ఢీకొనె పోలెండు
జర్మనీపై యుద్ధము ప్రకటించెను ఇంగ్లాండాతరిని
తనపరాక్రమము తనప్రభావమును నిలిపెను నింగ్లాండు
స్వరాజ్యపక్షము పరరక్షించెను న్యాయకర్మలందు
నిండుమనముతో బ్రిటిష్ ప్రభుత్వము నిలిచియుండెనయ్య
దిక్కులన్నియును నొక్కమూదికిగ బ్రిటను బొగడసాగె
అనుకొనినంతనె కార్యములవునే చూచుచుండగానే
ఒంటిపాటగా పోలెండు నిలిచె పౌరుషంబు వెలయ
ఎన్నాళ్లోపును పోలెండయినను ఆనదింతకును
బలముల సంఖ్యాధికమును పైగా యుద్ధనిపుణతయును
అంతకంతకు నధికమయి పెరగెడు జర్మను సైన్యమును
చెనకలేక పోలెండలసినది బలముచాలకపుడు

జర్మనుదండిటు కదలివచ్చుట రష్యాగాంచినది
చాలామట్టుకు అలముకొనియెను పోలెండున రష్యా
అందువలన ఫాసిస్టులవిజయము కొరతపడియె తెలియ
రష్యపరివారమురా వేగమె సంతసంబు హెచ్చె
జనసామాన్యము జయధ్వనులతో స్వాగతమ్ములిచ్చె
జగములోపలను రష్యాదేశము ప్రకృతిముననుగనిన
స్వర్గతుల్యమై సకలసుఖములను ప్రబలుచుండె మిగుల
సర్వజనమ్ముల ధనికులప్రాబల్యమ్మునంతనణచె
సమభావమునంతట పాదుకొలిపి సౌఖ్యమువర్ధిల్లె
జగమున కార్మిక బంధువుస్టాలిన్ జయము జయము జయము
ఆచంద్రార్కము శాశ్వతంబుగా శుభము గలుగునీకు
ఫాసిసత్వమును కడముట్టించి, బలమ్ముగూర్చినావు

స్వాతంత్ర్యపుబ్రతుకొసగినావు మాసుఖముగోరినావు
మా మనోరుధిరముల నీపవిత్రపాదములనుబూయ
నాజ్ఞయొసగుమాయయ్యాయని పరవశముగ భుజించె
జనులీమాదిరి యుత్సాహములో కలసిమెలసియుండె
పోలెండిట్టులమేళవించినది పరమశాంతి సమితిగ

వ॥ ఇట రష్యా ఆక్రమించిన భాగములో నీరీతినుండగా, నట జర్మనీ యాక్రమించిన ప్రదేశములో నేతీరుగానున్నదనిన.

జనులసంపదల కొల్లబెట్టెను హిట్లర్ హంతకుఁడు
స్త్రీలచిత్తముల దొంగిలించెను హిట్లర్ హంతకుఁడు
తినుటకుఁగట్టుటకును లేకుండెను సచ్చటిప్రజలకును
నిప్పుచ్చరమంతటవ్యాపించెను, యేమనిచెప్పుదింక
ఉరికంబములెక్కించిచంపెను ప్రజలనాయకులను
బలవంతముగా ప్రజలసేనలను బట్టిచేర్చినాఁడు
ప్రాణముమానము నపహరించెను బలవంతముగాను
స్వేచ్ఛస్వాతంత్ర్యములేదెసనుంచక మాయజేసినాఁడు
హిట్లరుమహాత్మ్యమున నిట్లాయెను పోలెండున ప్రజలు

వ॥ అప్పుడు పోలెండులో ప్రజలందరును యేస్థితిలోనున్నారనిన.

ఎదురురొమ్మున చేయిడినొకడును నిదురఁజెందలేదు
ప్రాణమ్మునుమానమ్మును నెన్నఁడు విశ్వసింపలేదు
రేపోమాపో యావెనుకనో యీకొంతదీరుననుచు
గుండెరాయిజేసుకొని భయమ్మున బెంగతోడమునుచు
మడియకుండ బ్రతికికొందరు మసిసినట్టివారివలె
దిక్కుకనబడక దైన్యంబునుదిగ ద్రావిమనుచునుండిరి

కనువారెవ్వరు వినువారెవ్వరు తీర్చువారలెవరు
ఓర్వరానియీబాధలవల్లను వచ్చినట్టిదెవరు
గల్లతోడునీడయులేకుండగ కూలిపోయినారు
ఈరీతిగ పలుబాధలు పడుచును పోలెండు ప్రజలు
సరిహద్దులరష్యాలోజేరిన తమనెయ్యురులంతా
భోగభోజ్యములు శాంతిసుఖములను ననుభవించుటగని
అటువలెతమరును కావలెనికొని యాసజెందియుండిరి

వ॥ ఇచ్చట ప్రజలందఱు పెద్దయాసతో యుద్ధిస్తూరు

చుండగా—

పిశాచిహిట్లరు ఘోరశక్తి మెయిసైన్యబలమ్ములను
ఒక్కపెట్టుగా ధుమికించాడు దిక్కులదరగాను
భూమ్యాకాశము నిండిపోయెను సైన్యబలంబంత.
విమానములు టాంకులు ఫిరంగులును సైన్యంబెల్లెడల
పుట్టనెలువడిన చీమలవలెనే నేలనింగినిండె
మహాజనముతో మహారభసమున మహాట్టహాసమున
ఫ్రాన్సుమీదకు దాడివెడలెను మారణయంత్రములు
హిట్లరు బలములు ఇటపరువెత్తగ ఫ్రాన్సుదేశమందు
ప్రభుత్వశక్తులు ప్రజలశక్తులును ఎటులనున్నవనిన
ప్రభుత్వమునకును లోబడియుండిరి. ధనికులందరపుడు
మెల్లమెల్లగా నేకముఖంబగు ప్రజలబలముగాంచి
ధనవంతుల గుండెలుకొట్టుకొనగ వెరపుమదిపుట్టి
హిట్లరుపోయినపోనీ మనదిక నేమిపాచిపోయె
ప్రజలబలమ్ములు పూనుకొన్నచో నిచ్చటరిది మనము
ప్రజలకు స్వతంత్ర మొచ్చిపోయినను నిలువవోలులేదు

వీరిద్దరితో గలసియు నుండామన కుదరకున్నదదియు
ఆయుధములు వీరచేనుండిన ముప్పువచ్చు మనకు
పగవాడట్లనెయుండక మనపై దూకుతారు వారు
సిరులుసంపదలు సరువు ఉరువులును పరులపరములగును
అప్పటి మనపగ లేగతితొలగును అంతులేనిపయ్యెన్
ఈతీరుగ చింతించిరెగద యూథనాథ్యులందరును
ప్రజలబలములను యుద్ధపరముగా జేయజడిసినారు
ప్రజాధికారులబట్టి ఖైదులోబెట్టి వచ్చినారు
చిందరవందరగాగ బలమ్ముల చితుకగొట్టినారు
ఏ నెపముననో స్వాతంత్ర్యవర్తుల బందించిరిపట్టి
నిరంకుశత్వము తమకు శాశ్వతము నిలుపవలయుననిరి
ఉన్నంతటిలో కొన్నిటినైనను సేనలసమకూర్చి
పోటకానివలె నాటకమ్ముగా పగతురనెదిరించి
ప్రాణముతో మువ్వంతుల సైన్యము ఆయుధములతోను
సఖ్యతబేరములాడవచ్చెను బ్రతికియుండగానె
అపుడు పెటేలను క్రొత్తకుభేరుడు ఉదయమొందినాడు
స్వార్థమ్ముల దలపోసినాడు దాసోహమ్మనినాడు
హిట్లరు పిశాచితాండవమాడగ నాంది చదివినాడు
బానిసత్వమును దేశశాంతియని యాదరించినాడు
ప్రజలసముదయము చిందరవందరలైన దండుపైన
సోషలిస్టులు కమ్యూనిస్టులు దుఃఖమొందినారు
అంతటితో సరి అణగినందురా? హిట్లరు హంతకుడు
[illegible]యమ్ముపయి. లగ్జెంబర్గుపయి హాలెండుపయిన్
[illegible] యుగోస్లోవ్యాలపయిన్ నార్వే దేశముపై

అంతకంతకును నౌక్కటొకటిగను నాక్రమించదలచి
పరుగెత్తించెను దానవబలముల క్రూరరాక్షసుండు
ఉన్న బలముతో హాలండపుడు తల్లిభావమునను
పగరబలములను దీసుకొన్నది బహుశూరత్వంబొప్ప
జయాపజయములు బలాబలమ్ముల మీదబూనియుండు
పాపమపజయము పొందినప్పటికి డీకొనె ఆలెండు
హాలెండురాణి ఇంగ్లాండునకును గతిచెడిపారెనుగా
దేశముచిన్నదియైనను బలమునుకొలదియైనగాని
త్యాగముసాహసమధికమై పరయుక్తిబొందిలోంగెక్
ఇటనిట్లుండగ నింతకన్నను జిన్నదైనయట్టి
బలముగలదియా బెల్జియమప్పుడు ఎటులజేసెననిన
సహాయమునకని బ్రిటిష్ బలమ్ముల హెచ్చరిక యొసర్చి
తనరాష్ట్రమ్మున నుంచుకున్నది హిట్లరు కర్పింప
పగతుండు తనపై పడియెనో లేదో శక్తిచల్లబడియె
బ్రిటిష్సైన్యములు దోవలేకయట పగవారికిజిక్కి
చావునకుతెగించి వెలుపలబడ్డవి డన్కిర్కునుండి

వ॥ ఈవిధముగాహిట్లరు నార్వే, డెన్మార్కు, మొదలగుచిల్లరరాష్ట్రములను రాక్షసపాదతుల్యమగు తనపాదముక్రిందబెట్టి నలిపివేసినాడు. నార్వే స్వాతంత్ర్యయుద్ధానికి బ్రిటిష్‌ప్రభుత్వంఉదార భావంగా సహాయంచేసినది. కాని చేంబర్లేను పొరపాటుపనివల్ల బ్రిటిష్‌బలాలుకూడా దెబ్బతినవలసి వచ్చినది. అందుకు ఇంగ్లాండులోని ప్రజాసంఘము ఆగ్రహించినది. ఆగ్రహించి, అతనిని ప్రధానపదవినుంచిదించివేసినది. ఆసమయమునకుంతితశిక్షాదీక్షలు, ధైర్యసయిర్యాలు, ములు కలచర్చిల్ మహామహుడు ప్రధానిగా న

మహామంత్రి తనజయప్రదమైన హస్తముతో ప్రపంచానికి అభయ మిచ్చినాఁడు. ఇక యుగోస్లోవేకియా—ఏమిచేసినాడనిన.

ప్రజలబలమ్ము చేతబట్టుకొని నిండుపౌరుషమున
ఆనకట్టవలె అడ్డగించెను హిట్లరు వాహినుల
దీర్ఘకాలముకు బలములన్నియును దైన్యవృత్తిజెంద
యేమిచేయను నుపాయముదోచకఓటము బొందియును
లొంగిపోయెను ప్రజావళి సర్వము నేకమొత్తముగను
దీనవృత్తిచేతను బ్రతుకులకును చిత్తమొప్పుకొనక
స్వాతంత్ర్యపువృత్తిని ప్రాణంబులు గడ్డిపోచలుగను
గణనసేయక గోరిల్లాయుద్ధమ్మొనర్చినారు
గెలిచిననోడిన జనములుండగా. నదియుచాగిపోదు
అరనిచిచ్చును నేరనిబలమును తీరనివైరమును
ఈలాగుననే ప్రజలందరును గోరిల్లాలైరి
చాటుగమాటుగ పగవానినిపైనుబడిచంపుతారు
ఒంటరిగా పగతుఁడుచేజిక్కిన చంపుకుతింటారు
యుగోస్లోవియా పేగుమాసినది హిట్లరుజయములతో
ఎన్ని దేశములనో యీలాగున కబళించెను కావట్టి
తనరాష్ట్రములోధనవంతులననిదా లొంగగొట్టినాఁడు
హిట్లరుదానవుండెట్టివాడో నెవ్వడెన్నగలఁడు
ఘోరరూపుడును క్రూరకర్ముడును బ్రహ్మరాక్షసుండు
హిట్లరుహంతకు డీపోలికగాఁ జరపుచర్యగాంచి
తమరాష్ట్రమ్మున శాంతిపద్ధతులు కుదురవంచు నెంచి
రష్యా యుత్తరిఫిన్నులతోడుత సంధికోరుకొనియె
కాసివాసివలె ఫిన్లాండప్పుడు తోసివేసినాది

తనదేశముకాపాడుకొనుటకై సోవియట్టు రష్యా
ఫిన్లాండునుకోరా నేనోన్నెలాదుల లాలించినద రష్యా
ఫాసిస్టులపై ననురాగముగల ఫిన్లాండయ్యెడల
కూలీరాష్ట్రము రష్యాతోడను స్నేహమొప్పదనెను.
పోరుతప్ప చాలాగై తేనని రష్యా వాకొన్నను
అదురును బెదురును లేదనియెను ఫిన్లాండు కుదరదనెన్నుచు
కొన్నిపురంబులు గుత్తకీయుడీ వానికిబదులుగను
పదిరెట్లులుగను తీసుకొనుడు మారష్యాలోపల్లను
అని పెనుత్యాగము దానముజూపెను రష్యాదేశమ్ము.
అది వినుపించుకొనక ఫిన్లాండప్పుడుమారు మొగముపెట్టె
సామదానభేదోపాయంబు లీమూడును సరిపడక
తప్పిపోయినను దప్పనివయ్యెను దండోపాయమ్ము.
నిడివడిపడ్డది రష్యాయుత్తరి ప్రజలబలముతోను
యుద్ధముసేయగ సిద్ధమైనది ఫిన్లాండయ్యెడల
వేనవేలు ఫిన్లాండు జనంబులు సోవియటను బొగడిరి
తమరాజ్యములో ధనవంతులు చనుపోకడలను దెగడి
రష్యాతో స్నేహము గావించెను జయప్రదముగాను
ధనవంతులు తమతమ మతకమ్ములు బెడిసికొట్టగాను
తప్పనిసరియని రష్యాతోడుత సంధికొప్పినారు
కోరినవియును గోరనివియును అర్పణజేశారు
రష్యాలోగల ప్రజలబలమ్ములు ప్రపంచశక్తులును
పోల్చుకునున్నవి. తీర్చుకొన్నటుల తమసైన్యముల సరి
ప్రజాసమరముకుతయారుకమ్మని జనులనెల్లనిలిపి
లోకములోపల నన్నిభాగముల స్వాతంత్ర్యము నిలుప
కట్టుకొన్నదికంకణమును జెయివీరత్వము ప్రబల

హిట్లరు సైన్యము రష్యాసేనల బలముగాంచి జడియ
రష్యన్ సైనికశక్తియుద్దాని నీతిబుద్ధి తెలిపి
సఖ్యతపడె, ఎస్తోనియలాట్వియలిథువేనియ గలిసి
ఈమూడును బాల్టిక్ సమీపమునయుందలి దేశములు
వీనితోడి నేస్తముజేసి రష్యాయొడలబలము
బాల్టిక్ సముద్రప్రాబల్యంబున నెంటబోయిచూడ
లోకమునందలిజనులబలమ్ములు మెచ్చెనెలమితోడ
రష్యన్ సంసర్గమ్మువల్లనను యీరాజ్యమ్ములలో
ప్రజలబలములు విజృంభించెను నూతనతేజముతో
ధనవంతులగోనర్చు తంత్రములన్నియు దగులబడ్డవచట
మనుజులబలము వృద్ధియయ్యె దమప్రభుత్వమునొకట
అట్లారాజ్యములందలి మనుజులు సోషలిష్టులైరి
రష్యావలెనే స్వరాజ్యములచట వెలుగుచుండెనీతి
సోవియట్టుల సముదయమాదున సభ్యతయుంగోనియె
ప్రజలచిత్తముల ప్రజలప్రభుత్వము సుఖమునించిమనియె
వెడలంబడిరి యీనిరంకుశత్వము సాధారణజనులు
అందరు బంధులై అందరువోరలే యేదెసగల్గోనిన
కష్టసుఖంబుల నెల్లజనంబులు సరిగపంచుకొనిరి
హోయిహోయి మాజీవితమునకింక హాయిగలిగెనంచు
ఏలపదాలు పాడియాడిరి యిష్టాగోష్టిగను
అంబుచుకొందలు విమానములపై నెక్కితిరిగినారు
ఏమనవచ్చును స్వరాజ్యసుఖమును నెంచనెవంతరము
రష్యారాష్ట్రము లోకములోగల జనులబలములకును
సర్వవిధములను సాయమొనర్చుట సర్వజనులకెఱుక

దిశదిశలనుశశికీర్తి ద్యుతులతిస్వచ్ఛముగను వెలుఁగ
స్వచ్ఛమైనభావముల జరింపుచు స్వేచ్ఛననుభవిస్తు
సామాన్యులుమాన్యులుశాంతి విధముబొందిసుఖముజెందె
ఈవిధమంతయు జూచుచుండెను హిట్లరుతీవ్రముగ
సామాన్యముగా జనులుసుఖింపఁగ జూడలేఁడువాఁడు
ఆనికంఠమున ప్రాణముండగా బ్రతుకనీఁడు ప్రజల
కన్నులారనొక్కనిసుఖమునుతా గాంచిచూడలేఁడు
ఏలాగుననో నెల్లరపట్టుక చంపుకతింటాడు
ప్రజారక్తమును పానముజేయును గుటకలువేయునును
హిట్లరనఁగ నరహంతకుడెన్నఁగ నేమిచేసెనపుడు
ప్రజలుబాగుపడఁజూడజాలక పళ్ళుకొరికినాఁడు
ఎఱ్ఱనిమొగమును ఎఱ్ఱనికన్నులు ఎత్తిచూచినాడు
జనులందరుసుఖియించుచునుండఁగ చూచుకుళ్ళుపడును
ఎన్నినాళ్లోయింగ్లాండుతోడ సంగరమొనర్చినాను
బ్రిటనైశ్వర్యముస్వహస్తగతమయినదని కనుపింపగను
బ్రిటనుమీఁదతెగిపడఁగ ప్రక్కలోనున్నబల్లెముగను
వెనుకతట్టునవిజృంభించగ రష్యారాణువను
కటకమున గనుఁగొనుచుండెను హృదయమదరుచుండ
తల్లడపడుచునుతనదండంతయుఁ బ్రక్కకొరుగుచుండ
నిక్కమురష్యా నేడోరేపో తమ్ముబలిగఁగొంట
ఎల్లిండునోతనస్థితియప్పుడు గనుగొనుటకుక్షమిపుడు
కర్తవ్యంబని తలచినాడుగద హిట్లరు ఘాతకుడు
నిప్పులుకన్నుల గురియదిక్కులు నిక్కిగాంచినాడు
అనాగరికుఁడఁతడవినీతిపరుఁ డతిదుర్మార్గుండు
ఏమోరష్యాచేయుచున్నదని సోదిచెప్పినాఁడు

జర్మన్ జాతిని మ్రింగివేయునని గంతులువేశాడు
వ॥ ఈతీరుగా హిట్లరు తలంచుచు
నెత్తివాండతండు పిచ్చివాండికను పాటిపోయెననుచు
హెస్సునుబంపెను ఇంగ్లాండునకు సఖ్యతజేయగను
సంధిబేరమును జరపడానికై హెస్సుతలచినాండు
బానిసరాజ్యము రష్యానిప్పుడు గెంటుదమన్నాండు
ధనరాష్ట్రంబులు తనకుసాయము జేయాలన్నాండు
యూరపు గెల్చుట రష్యాకొరకని జర్మని అన్నాడు
జర్మనికెనిమతి ఇంగ్లాండునకును నేస్తమెయన్నాడు
ఇదిబాగుందని ఖైదుచేసింది హెస్సును ఇంగ్లాండు
చర్చిల్ మంత్రియు హెస్సుంతోడను క్రియలేదన్నాడు
పేదతనంబును బాపుటకొరకై నెలపెట్టిమన్నాండు
సంధిబేరమిక సరిపడదనుచును కసరివేసినాండు
తల్లకిందులై హిట్లరుయూహాలు ఎదురుదిరిగెనపుడు
ఏమైనసరే తప్పదింకనని ఎదుటకుదూకాడు
సేనాధిపతుల పిలిపించాడు ముచ్చటలాడంగ
బెదరగొట్టితలక్రిందులవుదురని ధనికుల నెల్లరను
అచటికివచ్చిన సేనాధిపతులు తెల్లబోయినారు
చైతన్యముగల ప్రజలబలములను యీడులేనిజేసి
జాలిమాపులహిట్లరువంకను చేష్టలుడిగిచూచి
నోటమాటరాకిట్టిలబలికెను దీనహృదయులగుచు
జనమధికమ్మును అమోఘబలమును రష్యన్ సైన్యమ్ము
అటజన్మించినకుఱ్ఱండయినను సమరవీరుండేను
అటజన్మించిన బాలికయైనను వీరమాతయేను
వినోదముగా భూచక్రముపై జనుపవిమానబలములును
సేనలుటాంకులు సబ్ మెరీన్లు భువినెల్లగబళించున్

రష్యాజనములతోనాయుద్ధము శక్తిచాలదనిగి
అప్పుడుహిట్లరు చేసినదేమో యెవరుచెప్పగలరు
సేనానాయకునొక్కొక్కనిగొని చిత్రవధకుబూన్చి
చెఱసాలలఁగొందఱగొందర నురిత్రాళ్ళజేర్చిబేర్చి
గెలిచినవోడినపాటుబడునది దాఁగాదునుమండి
దిక్కులేనిజనములు వేలకొలదికలరు రాజ్యమందు
చొక్కాయొడలను చల్లడముమొలకుళ్ళాతలకిచ్చి
జర్మనుగాపాడెదు పనిమీయదియందు నొప్పగించి
పెద్దపోరునమహాగ్నిజనమ్ముల మీదుతలవలెవదలచి
యణుమాత్రముజంకక ప్రాణములకుబెట్టిగెంటినాడు
రష్యాపై నిపుడనిగావింపగ తలఫుచేసినాఁడు
ఉక్కబర చుకొనినన్నాహంబుల పైకిచూచినాడు
అక్రమముగనేమర్మమెఱుంగని మాయలేనిరష్యా
నిక్కమనుచుమదినమ్మియున్నయది అనర్థపుసంధిన్
ప్రాగ్దిక్కునసరిహద్దులదగ్గఱ దండునుంచలేదు
దుర్మార్గమునకుజర్మన్ రాష్ట్రము వచ్చునసుకొలేదు
పొలిమేరలలో కావలిదళములె కాపుగనున్నాయి
రష్యాసైనికు లెడనెడనుండిరి సర్వశాంతులకును
ఇదేతరుణమని యిదేకాలమని యిదియెయదననుచు
అటాత్తుగా గడిదాంగవోలె నడిరాత్రివేళయందు
ఒక్కసారిగా నొక్కతీరుగా హిట్లరు దాటాడు
వందలకొలది మైళ్ళపొడుగున దండునడిపినాడు
గగనతలమునను బొబ్బరించినవి విమానఝాంకృతులు
భూతలమునఁగడు బూరటిల్లెను భేభేభాంకృతులు
వెక్కసముగ సైన్యమ్ములునడిపెను దిక్కులదరగాను

అకటవికటముగ పిచాచగణములు తాండవంబుద్రొక్క
పెటపెటదిక్కులు పెకలిపోయెను ఫిరంగిమ్రోతలకు
తిరిగిపోయెగిరగిరధారుణీయును టాంకులధాకలకు
ఫిరంగిగుండులు తుపాకిగుండులు వ్రేలసాగెమిగుల
పెద్దబాంబులు ఫిరంగిగుండులు మేళగించినాయి
సేనలరాకడ సాగినయంతనె నేలతల్లడిల్లె
విమానదాడి వెలువడినంతనె నింగిపొంగిపోయె
సంగరమేఘము సొక్కసారి గర్జించెనుగనుగొండి
బాంబుఘిమగుల నవాంతరమ్ముగను పర్జించినవండి
అప్పటికిరషియ యందలిజనములు నిదురలేవలేదు
ఎవరిండ్లలో వారుండిరనెమ్మది పోరుతలంపులేదు
మాయలేనివారందఱు నప్పుడు బాంబులకెరయైరి
మిడుతలవలెనే మాడిపోయిరి నిమిరమత్తుతోను
రిబ్బన్ట్రాపను జర్మనురాజ్యపు విదేశపుంమంత్రి
మాపై రష్యా పడిపోవుటకై సిద్ధమైనదిపుడు
విప్లవబలమును యుగోస్లవేకియ ప్రజలకుగూర్చినది
బెస్సరేబియా బుకోవినాను రుమేనియాలోను
చేపోమాపో దెబ్బతీయుటకు నాలోచించింది
వేచియున్నది అందుకోసమే ఆవరించుకొనియు
నెయ్యముజూపును నెమ్మదిమమ్ములం గూలద్రోయనెంచె
ధనవంతుల భూములనన్నిటి దా నలముకొనదలంచె
ధనవంతులమర్యాద గౌరవము రూపుమాపజూచె
ధనికులపరిపాలనమే ఇపుడు నిలువరించవలెను
రష్యాయుండుటో మనముండుటయో చూచుకొనగవలెను
రష్యాభావము ధనికస్వభావము నాశముచేయుటయే

కూలినాలిజనములు మనమీదను నధికారముచేస్తే
ముండలవలెమనముండుట యెట్టులపొసగు తెలుసుకొంటె
మనమర్యాదకు సరికాదెన్నడు రష్యాప్రాభవము
వారికిమనకును విరోధమెన్నడు బాసిపోదుసుమ్మ
మాకేదేశము పగకాదెన్నడు రష్యాయొక్కటియే
ప్రపంచమంతకు శాంతిగూర్చుటకు దాసిగెలువవలెను
మాకుసాయమై నిలబడుడందఱు గెలుపుగొందమిపుడు
మనప్రతాపములు మింటలొగలయు రష్యాగెలిచినను
అన్ని దేశముల కుపదేశించెను యీవిధంబుగాను
తమలోనైక్యము లగుననితలచెను ధనికరాజ్యములును
వెఱ్ఱితలపులు పిచ్చికలలు వీనెవరునిశ్వసించు
గౌరవంబుగలవారైనను దామితరి రాజ్యములను
ఇతరసంపదల కవలంభింతురె? మొండితనముగాను
రష్యాదేశము నిదురమేలుకొన నొక్కసారిగాను
అటూత్తుగాపై బడ్డశత్రువుల గదిసిమారుకొనియె
కావలివారలెహిట్లరుసైన్యము దాకెనడ్డగించి
మహావాహినియు కట్టువడినది గులకరాళ్ళచేత
తెగబడిహిట్లరు తెచ్చిపెట్టెను సేనలనన్నిటిని
పోటరిపోలిక చీకటిచాటున పెట్టుపెట్టినాడు
కావలిబంటులకడకుదో్రిఁ దాముందుసాగినాడు
గొప్పగజర్మనులోననందులకె ప్రజ్ఞలుపోతూడు
అత్తరిరష్యా విదేశమంత్రి వీరుడు మాల్టావు
మహాప్రభావుడు మహాశాంతుడు మహాప్రతాపుడును
సారియశస్కుడు శూరశిఖామణి శత్రుభయంకరుడు
సుందరమూర్తియు సుగుణప్రవర్తియు జనహితవర్తియును

అటాత్తుగా హిట్లరుసైన్యంబులు తనరాష్ట్రిముమీద
దాడివెడలెనని తెలిసివెంటనే ఆశ్చర్యమునుబొంది
నిన్నటిదాకా నెయ్యంమ్మంటా హిట్లరుఅన్నాడు
అర్ధరాత్రితరి అన్నిదిక్కులను పందులనింపాడు
దోసగాడుపెనుమోసగాడతండు బందిపోటుగాడు .
చెండాడగవలె చీల్చివేయవలె హిట్లరుహంతకుని
పటపటపటపటపండ్లుకొరికెను కఠినచిత్తమునను
అమాంతముగ దాప్రశాంతహృదయుడు నాగ్రహించినాడు
తేనెలొలుకుమామిడిపండులలో విసమువెల్లడించె
లోకములోనీవిధంబుగను దానుపదేశించాడు
పూజ్యమయినమనస్వరాజ్యపద్ధతి పారదోలుటకునై
హిట్లరుఘాతుకుడేకతీవ్రముగ దండువెడలినాడు
పగడియకోయిటు లిదిరాగలదని గాంచుచున్నారు
గాంచుచునుండగ వచ్చినదియ్యది పోరిగెల్వగలము
ఇదియిరువదినారేండ్లనుండియును కోట్లకొలదిజనులు
చెమ్మటనూడ్చియునార్జనజేసిన జనులస్వాంతములను
మనసంపదలను మనవిజయంబుల మనయాధారముల
రూపుమాపుటకు దోపిడిదొంగై హిట్లర్పడ్డాడు
దృఢముగనిరువదికోట్ల యుద్ధకుల హెచ్చరించినాడు
మనగెల్పులపడగొట్టకెట్టుగా పకపకహాసియించె
భయంకరమయిన సింహనాధమున గర్జనమొనరించె
యీపాసిస్టులకిచటనుండుటకు నీడయైనలేదు
యీపాసిస్టులిచట తుదిగాలుల పీల్చికొంట ధ్రువము
కత్తిపట్టవలెనిరువదికోటుల వీరముఖ్యులెల్ల
పగతులుచేజిక్కిననెక్కడయిన తునకలుజేయవలెన్

ధనమత్తతగలవారలురాసై జర్మనుమనుజులను
రణరంగంబున నిలువబెట్టిరి మనసోదరులసముల్
మశకునువారికి పగలేదెన్నడు వారిదేహములను
బలిపెట్టుటకై యెదుటకుద్రోచెను హిట్లరుహంతకుడు
కసాయిహిట్లరుసేనల నన్నిటి మసిచేయగవలెను
జంకునుగొంకును స్నేహముమోహము గాంచబడనికలను
నెపోలియనునకు పట్టినగతియే హిట్లరునకు బట్టెన్
రష్యన్ వీరప్రముఖులిందంతట తరిమితరిమి కొట్టున్
ప్రతిపురుషుండును ప్రతిస్త్రీయును పసిబాలురునై తమును
దూకవలయు రణభూమికిత్వరితము వీరత్వము జూప
ఆలస్యమ్మనకాలోచనకును తరుణంబిది కాదు
కరుణయింతలేక జాలిబొందక వైరిసముదయమును
అణగద్రొక్కవలె పొడిచిచంపవలె జంకుకొంకులేక
పగవానికినొకక్షణమైన విరామమీయదగదు కలన
వెంటనంటిజనిబలములనన్నిటి జంకకపోగిగొనుడు
జంకుటంకులేనివి మనసైన్యము లనుపమానములును
సాహసమ్మనుత్సాహముగదురగ పౌరుషంబుతోడ
స్వరాజ్యములరక్షించుటయే దీమసంబుగాను
మనవ్యూహబలంబొక్కపెట్టుగా బలిగొనువిరోధిని
ఎల్లదేశములునొక్కటపోరెను యీవిధమునననిన్
ప్రతాపములతో ప్రజాసముదయము వీరత్వంబొప్ప
రక్తమిమ్ముగాపొంగిపారగా మహాతేజమునను
కుతూహలమ్మున విజృంభించిరి పులకాంకితతనులై
ఎవరిమట్టుకు వారుగ్రహించిరి తమకర్తవ్యమును
యుద్ధనిపుణులై గెలుపుబొందగా సంతసించినారు

పగవారలనందఱ నేనొక్కడనే దునుమాడెదను
హిట్లరుతలనరికి కోటగోడకు వ్రేలగట్టుదీకను
ఈతీరుగనేవరికివారు ప్రతినపట్టినారు
క్రోధపూరితులునై రణభూమికి వేగదూకినారు
జర్మనుమర్మాగ్నముజగమంతయుఁ దెలుసుకొన్నదింక
ఏవగించినదియేకముత్తముగ హిష్లర్ దౌష్ట్యమును
బ్రిటిష్‌మంత్రి బహుఘటికుడు చర్చిల్ సలికెనిట్టులచట
స్వతంత్రముపకు సర్వరక్షణకు రష్యారాష్ట్రిమ్ము
పోరుచున్నదివీరధర్మముగ మహితమాదరువుగ
మనకుగల్గినది మనచేనైనది చేయవలెనసహాయం
పనిచాంద్రాదదము వస్తువిహామ్ముగ గల్పింపగవలెను
మనసహోదరులురష్యావీరులు వారివిషయమిప్పుడు
పాటుబడుటబహుహితము వ్యక్తిత్యాగమునకైనవోర్చి
కఠినుడునగుహిట్లరుసైన్యంబులు సర్వనాశనమగున్
సత్యనిరతుడౌస్టాలిన్ యోధుడు శాంతదాంతుడగును
అనివక్కాణించెను యీవిధముగ భూలోకముపొంగ
ఇంగ్లాండులోనిజనసముదాయము అనుకూలమునొంద

వ॥ భూలోకమునందలి అన్నిదేశాలవారును హిట్లరు చేసిన యన్యాయమును దూషించుచు రష్యాయందుతమ సానుభూతిని కేంద్రీకరించినారు పశ్చిమార్ధగోళంనుంచి, అధ్యక్షుడు రూజ్‌వెల్టు మహాశయుఁడు, సహాయసానుభూతులను అందించినాడు. అన్నిదేశాలు ప్రపంచముకి పాటుపడగలదేశము రష్యా,ఒకటే అన్నవి. దేశదేశాలలో మూలమూలలాపున్న కార్మికకర్షకులందరు. ఆదేశాని, ఆరాజ్యాని సముద్ధరించటానికి సిద్ధంకావాలని, ఒక్కపెట్టున ఘోషించాయి. ఇక అక్కడ రష్యారంగములో,

విమానములఝుంకారములకు నాకాశమదిరిపోయె
మరఫిరంగులఢంకారములకు పుడమిపెల్లగిల్లె
నడచెడిమనుజుడు ముడిసెడిమనుజుడు పొడిచెడిమనుజుడును
కలియబెట్టినది సంగరరంగము భయంకరముగాను
వచ్చెడువాడు నిల్చెడివాడు త్రెళ్ళివిచ్చువాడు
బాహాబాహీబాహుసత్తువల తోడఁబోరువారు
బాంబులుపైపై బడుచునుండగా ముందుకురుకువాడు
ప్రాణమును తృణప్రాయముగా వారచట జూచినారు
సేనాధిపతులయానతిమేరకు నిలిచిరిజర్మనులు
స్వదేశరక్షకస్వతంత్రదీక్షకు నిలిచిరిరష్యనులు
తేరిచూడగా దేవాసురలకు రాబడెనురణమ్ము
యుద్ధరంగమునపిశాచసంఘము పేర్చియార్చుచుండె
నక్కలుకుక్కలు వేచియున్నవి చిక్కుమనుజులకయి
రోషానలమిరుదెగలనయించెను విడువరానిపగలు
అత్యంతమును మనంబులందున నినుమడింపగాను
పెంజీకినవెరణరంగమ్మునకు దుస్సహంబుగాను
ఘుమిశినారుపెనుగండరగండలు రష్యాసైన్యములు
అట్టడుగునకే యడగసాగినవి జర్మనుసైన్యములు

వ॥ యుద్ధరంగమంతా క్రోధాగ్నులతోను మారణాగ్నులతోను, భస్మీపటలమై మండిపోవుచున్న యీతరుణములో రష్యాలోని ప్రజాసామాన్యం ఏలావున్నదనిన,

ఎల్లమందియును నేకకట్టుగను నిలిచిపోయినారు
హిట్లరుపట్టుక పల్లార్చంగా పట్టుపట్టినారు
సనివాంత్రకందరుశ్రమయనిదలపక యంత్రశాలలందు
చేయిచేబవలు నాయుధమ్ముల తయారుచేసుకొనిరి

జనులస్వాంతమునుగౌరవమునునిక మాపుజేయనెంచి
తమమీందబడిన హిట్లర్ దుర్మార్గమును మతిదలంచి
నిమిషనిమిషమును విమానసంఘము టాంకులబలములును
ఫిరంగిగుండులుతుపాకీగుండులు టార్పిడోలుమఱియు
మారకకారకములయిన బాంబులు కల్పనచేశారు
నాగలిగిట్టినప్రతిపురుషుండును ప్రతియాదుదికూడ
ప్రతిజ్ఞబట్టిరి తమరాజ్యమ్మును సుభిక్షముగజేయ
జనాధికారులుజనావళులకును బోధపరచినారు
రణరంగమునకెదురుముఖముగ నిలబడగదీర్చినారు
విద్యార్థులుయువకులుసర్వులు నిటులుద్యమించినారు
ఆగౌరవముగలయరాతిపీరుల నణగద్రొక్కగాను
లోకములోయువజనములు నిలువుడుమీస్వాతంత్ర్యమును
నిలుపుకొనుడుమీతవునులజీవము నిలుచునంతదనుక
పరాయిరాష్ట్రమువిదేశపాలన మేటికిమనకింక
తెగువనురండి ఫలమునతెండి బలిమినిపోరండి
ఎప్పటికైననుమరణముదప్పదు బ్రతుకుస్థిరముకాదు
స్వార్థముగోరకమమతనుబాసి ఎదుటకురికిరండి
మీసిరులునుసంపదలును మీరును నుండువారుకారు
లోకిమంతయునిరణాగ్నిలో బడిరగులుచున్నయపుడు
యీతీరునయువజనసంఘమునకు నూరిపోసినారు
చిన్నపాపలకుశౌర్యరసమ్మును నుగ్గుపోసినారు
అనమానాగ్నులనాలేచెక్కుల లెర్రవారుచుండ
ఎల్లదేశమునునీచందముగా సమరోన్ముఖముగను
రష్యాబంటులుఱతయారుచేసిరి ప్రభావవంతముగ

వ॥ అప్పుడురష్యాలో నేవిధమైన పద్ధతులుజరుగుచున్నవనిన

అధిపతియయ్యెను స్టాలిన్ వీరుడు సర్వసైన్యములకును
రష్యాహోవతిరంగమందతడు సమము కానివాడు
ఈడునుజోడునుసాటియుసరియును వానికేడు లేడు
లోకంబుననతడొక్కడె ప్రముఖుల ప్రముఖుడైనవాడు
మంత్రతంత్రయంత్రాంగములు మొదటవానిముఖత మొలిచె
దయాదాక్షిణ్యముధర్మమాహవము వీరములన్నియును
అణగియున్నవవిగూడశక్తిమెయి యతనియందునవనే
లోకహితంబునుకబళించిన ధనవంతులశత్రులకు
హృదయశూలమావీరుండన్నను సునుకుపట్టబోదు
కిన్నుమాయదుధనికునింటిలో పసిబిడ్డయునైన
పరదూషకుడును స్వార్థపరుండును శత్రువులాతనికి
శూరధర్మమునశత్రుసమూహము ఖండించెనతండు
యుద్ధములోనాతనిపై మించిన శూరుడొకడులేడు
కోటలకొలందిగకూటికుండని బీదలస్నేహితుడు
విద్యనేర్చుకొని పోషింపబడని బడుగులచెలికాడు
సుఖమునుగష్టములెక్కసేయుడు పరాక్రముడతండు
శాంతంబెంతో దాంతంబెంతో అంతయుదాత్తుండు
అంతయశాంతము అంతయదాంతము అంతనుదాత్తుండు
సుగుణవంతులకుసుగుణుండునగును నిక్కమెఱుంగగాను
చెనటులకుబల్ చెనటియవు బలిమిదుపిటువేయుగాను
ఇట్టిజెట్టియునిట్టివీరుడు నుపన్యసించినాడు
రెండుచెవులనిక్కించివిన్నది ప్రపంచంబంతయును
స్వరాజ్యములకును జీవధనంబతడేమిచెప్పెననిన
సంగరభేరులు మ్రోగుచున్నవి దిక్కులదుగుమంత
జయశబ్దమ్ములు సాగుచున్నవి భూనభములునిండ

ఝుంకారమ్మగు కంఠనాదమున కడుప్రయత్నమునను
ఈలాగునతానుపన్యసించెను ప్రజారాజ్యములకు
కర్షకులారాకార్మికులారా భూజనవరులార
హంతకుడగుహిట్లరుమనమీదకు దండువెడలినాడు
లోకములోపలస్వాతంత్రమ్మును దుంపబూనినాడు
లోకమునకుదాతోకచుక్కవలె గనబడుచున్నాడు
పరభాగ్యములను హరించుటకై పాటుబడెడువాడు
ప్రపంచమంతయు తనబానిసయై యుండదలచినాడు
జర్మన్ ధనికులుతానునుతప్ప జనములులేరనుచు
జంతుసంతతిగ తక్కినజనముల వ్యవహరించుకొనుచు
యెంతోతెలిసినవానిగ నెదుటకుదుమికినాడుక్రోధి
క్రూరసైన్యములుతనతోకూడా కలిసిరాగమిగుల
లోకంబునకంతకు విప్లవిమిది వేగదాటవలెను
ఒనగూడినదియుపాయపద్ధతి ఒద్దుకొనగవలయు
ఈయుపాయమును తప్పించుటకై సోవియట్టరష్యా
గొప్పయుద్ధమునుజేసితీరును ఎక్కువత్యాగమున
భూమియంతయును నెత్తురుకోశను ముంచినైతుమికను
ఇట్టులెవచ్చెను నెపోలియన్ వీరాగ్రగణ్యుడపుడు
అరుగుదెంచెను ముందుముందుకు దండుబలముతోను
అభినివేశమునమాస్కోదాకా గెంటుకవచ్చాడు
ఎగురవేసెనుమాస్కోపై తనమలినకెక్కియమును
అప్పటికప్పుడు జయముకలిగెనని సంతసించినాడు
యుద్ధయత్నమునరష్యాసైన్యము లంతలోనెబ్రబలి
నెపోలియన్పై నొక్కపెట్టుగా పక్షవబ్బురముగ

వ॥ ఆసమయమున నెపోలియన్ చింతాకులితామానసుండై యెటులుందోచక,

తనబలమ్ములను మాస్కోనుండి త్రిప్పజాలడయ్యె
చెల్లచెదరులై యెక్కడికక్కడ దెగినశించెనపుడు
సైన్యమునైననుగూడదీసుకొన నేరడయ్యెనతడు
వడిలోబడికొట్టుకపోయెడు తనసేనలగనలేను
అతివేగముగాప్రాణముతోడుత పారుకాడెనతడు
అట్టివిభవమే హిట్లరుకిత్తరి పట్టనున్నదింక
మీజీవమ్ములు మీసమస్తమును రాజ్యమ్మునకనుపి
జనసమ్మర్ధమురక్తపానముల నణగద్రొక్కవలెను
మనపావనరష్యాప్రాభవమును నిలువబెట్టవలెను
అంతములేని బలముగూడుక సాయుధబలములును
పోగుజేయుదుము అంతేబలమ్మును అర్థబలమ్ములను
వైరిబలమ్ముల భస్మీపటలము చేసితీరగలము
మరిఫిరంగులునుమరతుపాకులును నుండినలేకున్న
గడ్డపారలు, కర్రలుకత్తులు ఈటెలుగొడ్డళ్ళు
సల్లెములునుబాకులు నవియేమిటి యేదమరిననదియే
కైదువుగాగొనిహిట్లరుదండును హతమొనర్పవలెను
పెక్కువిపత్తులపాలుచేయుదము తునకలుగాజేసి
వైరిబాటలును ధైర్యంబొప్పగ ఖండింపగలము
ఆతనియాయుధనిలయములన్నియు పొడిపొడిచేయుదము
చెప్పనేటికిక యిదియంచును సోవియట్టులన్నన్
జర్మనులకు సేనానాయకులకు సేనలకన్నిటికి
వర్తింపగవలెభయముపుట్టగను రణరంగంబునను
అనియిత్తెరగున వివరముజేసిన ప్రపంచమంతయును
చెవులవిందుగనువిన్నది కన్నది కనులపండువుగను
ప్రజానాయకుడురష్యాలోని విజయముబొందనుంటు

శక్తిసామతిసాంతనముసు నాదేశపుబలమరయ
అస్త్రభయంకరముజ్వాలమోఘ వీర్యవంతమనుచు
పొంగిపొరలిరి తమలోతామై జగమునందుజనులు
ఇటనిటులుండగ రణరంగంబున నెట్టులుండెననిన
సొరచేపలవలె టాంకులువిడివడి త్రోవజీల్చిచనగ
గండుమీలవలె మోటార్బండులు పరువులెత్తుచుండ
గుఱ్ఱపుదళములు తరంగములగతి పొరలిపొరలిరాగ
బుద్బుదములవలెగాణునయంతయు ఒడ్డుపట్టుచుండ
ఎక్కువబలమదిమహోదధివలెన్ పొంగిపొరలుచుండె
కీలూడినజంత్రపుప్రతిమలగతి ఒండొరులదలపడుచు
చావుబ్రతుకుల సంగతినెన్నక మెయిమెయితెగబడుచు
క్రోధరసముమూర్తీభవించినటు లిరువాగులుపోరె
దొర్లెడుశిరములు త్రెళ్లెడుపీనుగ లిన్నియన్నిగావు
మలయుదళమ్ములు మడియుబలమ్ములు చెప్పవశముగాదు
కడుఘోరంబై కడుభీషణమై సాగుచుండెపోరు
లోకమునందలి ప్రళయాహవముల నొంటినొంటిజెనయ
రక్తముగ్రక్కుచురణరంగమున వరాగమ్ములచెలంగె
ఎన్నడువినలేదెన్నడుకనలే దిట్టిసమగమువని
ఈశూరత్వమునావీరత్వము నబ్బురముంగొల్పు
ఎవరుగెల్తురో ఎవరోడుదురో కాంచవలయునంచు
లోకమంతారష్యామీదన తమదృష్టినిలిపినారు
నేయిభంగులను విజయముబొందగ దీవెనలనొసంగి
వెంటవెంటనేచేయగలిగిన సాయంబునుజేసి
వీక్షించుచునున్నదిజగమంతయు రష్యావిజయముకై
మూడురంగములుగ్గానొనరించెను రష్యారంగమును

విభజనచేసెను స్టాలిన్ యోధుండు సేనానాథులుగ
మూవురువీరుల నియమించాడు ధర్మయుద్ధపరుల

వ॥ అందులో లెనిన్‌గ్రాడ్ రంగంలో మార్షల్ వోరోషి లోవ్ సేనాని నియమింపబడ్డాడు ఇతడెట్టివాడనిన,

గండరగండడు చిచ్చరపిడుగు శత్రుభీకరుండు
నూచమెట్టగావిరోధివీరులను గొనర్చినాడు

వ॥ మొదటవోరోషిలోవ్ సామాన్యమైన కూలీవిధముగా కూలీలలోపనిచేసి వారలోనాయకత్వం సంపాదించినాడు. అందులోను అసమానమైన యుద్ధనైపుణ్యమును గణించి పేరుపొందినాడు విప్లవం నాటనుంచి నేటివరకు రష్యాకు తనసైనికశక్తి పెట్టనికోటగా కనపరచి నాడు. ఇతడు లెనిన్‌గ్రాడ్ రంగములో,

బుజ్జగించెనుప్రజలనందఱను నుపన్యసించుచును
అరాతిబలములగండువిగల్చును రణమొనర్చుచును

వ॥ మాస్కోరంగములో మార్షల్ టిమొషింకో సేనాని నియమితుడైనాడు. అతడువెట్టివాడనిన,

మధ్యందినభాస్కరునిగండు ననురిపుబలజృంభణను
పరిహరించెనుకనికరమునువిడి పరాక్రమములోడ
పరసైన్యంబులవీనుగుపెంటలుగా నొనర్చినాడు
అంతకంతకునూతనశక్తితో నూతనధైర్యములో
హుమ్మనిముందుకు దుమికినాడపుడు ధరణితల్లడిల్ల
ఆరభసమునకుమతులుచెదరెను దిక్కులదరిపోయె
ఘూర్ణిల్లెనుకులశైలములప్పుడు సింహనాదములకు
విక్రమవంతుడు వీరస్వరూపుడు మార్షల్ టిమొషింకో
శత్రువీరులకుపక్కబల్లెము మార్షల్ టిమోషింకో
ఈ ప్రముఖుడునువెఱ్ఱిబలములను దిట్టపరచినాడు

నెపోలియన్ గతిబట్టించవలెర హిట్లరుకన్నాడు
దినములుచాలకవచ్చినాడనుచు ఘాసిట్టన్నాడు
గొప్పబలముతో మహాక్రూరముగ పగతులదునిమాడు
వెన్నెముగనివీరశిఖామణి యెదురకపదుమికాడు
వీరస్వరూపుడువిక్రమవంతుడు మార్షల్ టిమోషెంకో
శత్రుసింహులకుపక్కలొబల్లెము మార్షల్ టిమొషెంకో

వ॥ మరిదక్షిణరంగంలో మార్షల్ బుడానీ నియమించబడ్డాడు ఈతడెట్టివాడో విందురుగాక!

వీరసింహుడువిప్లవవీరుడు విక్రమైకధనుడు
గుర్రపుదళములకధ్యక్షుడు గుణియుచుపమానబలుడు
జర్మనురాణువసాగిరాగనే యేమొనర్చినాడు
తనబారెడుమీసములబట్టుకొని మెలికపెట్టినాడు
హిట్లరు!ఓరే కళ్ళు తెలియదా? మన్నుమిన్ను కనవా?
ధనవంతులధవుప్రాన్సుగాదిదీ బెల్జియమ్ముగాదు
స్వతంత్రమునమనుకూలీరాజ్యము సోవియెట్టుర ష్యా
నీడంబములకులోకువకాదిది బింకములింకేల
పారుకాడకనిలువుమిక్కడను నీబలంబు తెలియు
చెండాడెదనిను, చీల్చిచంపుదును పారకనిలబడరా!
అనియన్నాడంతె మోఘువిక్రమ మద్భుతముగమెరయు
యీవాక్యములకుహిట్లరుగుండెలు దడదడకొట్టుకొనెకె
ఇంతటనంతటహిట్లరురాణువ మూలలకొదిగినది
స్వరాజ్యములమనుజానీకంబులు యిష్టమొందినారు
పనివాండ్రుకృషీలురును ధైర్యముతో మెలంగినారు

వ॥ ఈమూడురంగాలలో బలిష్టమైన రష్యన్ సైన్యాలు విజృంభించుచుఁ జర్మనుసైన్యాలను రూపుమాపుట కారంభించాయి,

కాని, రష్యా అప్పటికింకా పూర్తిగా సన్నద్ధం కాకపోవడంవల్ల సంఖ్యాధిక్యత యంత్రాధిక్యత అప్పటికి కలిగియున్న జర్మన్ సైన్యాలు కొంత ముందుకు సాగినవి. ప్రతియడుగులోను ఎర్రదళాలు జర్మన్ల రక్తాలను చిలకరిస్తునే వెనుకకు నడిచాయి. సాధ్యమైనంతవరకు హిట్లరు ముఠాను చీల్చిచెండాడుతూ, రష్యను సైన్యాలు వెనుకకు తగ్గుతూ, నీపరు నది ఆనకట్టుదాటవలసి వచ్చినది. నీపరు నదిగట్టున అమోఘమైన యుద్ధంజరిగినది. ఆనీపరుఆనికట్టు యేలాంటిదంటే,

దానిగట్టిరికోట్లకొలదిగజను లేండ్లకొలదిగాను
సాగుచేసిర్దిదానిక్రింద కోట్లాదియకరములును
సమీకరించిరియింజనీరుల నైపుణ్యంబచట
పనివాండ్రందరుతమకండబలిమిని గూర్చిపేర్చినారు
అమూల్యమైనదిఅనన్యమైనది అమోఘమైనదది
మనుజబలమ్ములుతిరుగుమొగమగుచు ధైర్యపటిమమెరసి
వగులగొట్టిరిగట్టిసని తరవునీపరానకట్టు
ఎంతయుదారతఎంతసాహసము చేసినారువారు
పితరులరాజ్యముపగతులనుండి తప్పించుటకొరకై
విడిచిపెట్టినపాలునందున వైరులకేమూల
పిడికెడువిత్తులుదొరకకుండగ తగులబెట్టినారు
త్రావనీరునులభింపకుండగ దొరువులుపూడిచిరి
ఉండనీడయనుగలుగనీయక చెట్లనరికినారు
ఈతీరుగరష్యావీరవరులు కలనొనర్చినారు

వ॥ మరియునింకనేవిధముగ నొనర్చినారనిన,

అలముకొనినహిట్లరుభాగములో సోవియట్టులెల్ల
చాటుగమాటుగపోటలాడిరి వైరిదండుతోడ
ఆయుధశాలల నర్ధరాత్రమున లోనజొచ్చినారు
ఆయుధమ్ములనుసందివమ్మునకు సంగ్రహించినాడు

తగులబెట్టిరితక్కినవానిని మంటమింటనంట
శత్రుసైనికులు విడిచినచోటుల దాడిసలిపినారు
పగతుడును స్థిరంజెందియున్నపుడు నమ్మకమ్ముగాను
ఒంటరిగాచేజిక్కినశత్రువు చంపివేసినారు
తునకతునకలుగ ఖండనజేసిరి జర్మనుసైనికుల
ఆహారద్రవ్యాలదెచ్చులాగిల నిరోధించి
తినుబండారములంకొల్లగొనిరి ముచ్చులచందమున
అయ్యోబాబోయనిశోకించెను వైరివర్గమెల్ల
త్రాగనీరునుతినుటకుతిండియు వారికికరవయ్యె
గొరిల్లాలీతీరుగజేసెను జర్మనుసేనలను
ఎన్నివిధములనో ఏడిపించుచునుఎదుగొనచేశారు

వ॥ జర్మనులిట్లమితముగా నష్టపడుచు. తమశవాలనే తొక్కుకొనుచు ముందుకునడిచిరి ఇదివరలోదాను జయించినయూరప్ దేశములో సమస్తబలములతోను, అకస్మాత్తుగనొక్కసారి రష్యామీద పడ్డహిట్లరు తాత్కాలికముగా జయము పొందడములో నాశ్చర్యమేమియులేదు. అందులకు భయంపడవలసినపనియులేదు. జర్మనుసేనలు ముందుకు సాగిస్టాలెనన్నమీదకు వచ్చినవి స్టాలెనన్నరక్షకులు తమ సోవియట్ సైనికనీతికితగినట్లుగా, ప్రాణాలకువెనుదీయక, భయంకరంగా, శత్రువులను ప్రతిఘటించినారు. మహాప్రళయముగా 21 దినములు యుద్ధముచేసిరి. స్టాలెన్నక్క స్మశానములో మూడులక్షల జర్మన్ సైనికులకు స్థానమిచ్చిరి. తుదకుస్టాలెన్నగరక్షకులు వీరోచితముగాతమబలాలు చెదరకుండ నుపసంహరించుకొనిరి. ఈవిధముగనే దక్షిణరంగములో కీవ్ ఖార్కోవ్,ఒడెస్సాలను, అమితజనవస్తునష్టమునకోర్చిజర్మనీజయించినది. బాకూనూనెగనులపైపు దృష్టినిగిడ్చినది. అప్పుడుస్టాలిన్ దక్షిణరంగానికి మార్షల్ టిమోషింకోను పంపించెను.

విక్రమాఖ్యుడును వీరమూర్తియూ మార్షలుటిమోషింకో
అరాతివీరులపక్కబల్లెము మార్షల్ టిమొషింకో
శత్రుసైన్యములనిలిపెను ముందుకుసాగకుండగాను
నిలిపినాడుగరష్యాసైన్యంబుల ధైర్యముపురిగొనగ

వ॥ ఉత్తరముగా లెనిన్‌గ్రాడ్‌రంగములో హిట్లరు జూదరి లెనిన్‌గ్రాడ్‌ను విపరీతమైన సైనికనష్టములకు నాయుధనష్టములకోర్చి మూడు నెలలహోరాత్రములు శ్రమపడిచుట్టివేసెను, కాని, వొరోషిలోవ్ నాయకత్వముక్రింద సోవియట్ బలాలు చెక్కుచెదరకుండ నమోఘమైనధైర్యముతో పనిచేయుచున్నవి. లెనిన్‌గ్రాడ్ రక్షకులు లొంగిపోవలెనని హిట్లరుకోరెను. అప్పుడు వారేమనిరనిన,

మీకులోబడుటకన్నను నుసుఱులవీడుకోలుమేలు
రాజ్యరక్షకిత్తుముప్రాణమ్ములు నీకులొంగి రాము
అనియిట్లనుచును మీదిమీదికి వచ్చినారుమీరి
అచటనిలిచిరిహిట్లరుసేనల చెండాడుచువారు
ఇరువైపులశాత్రవులున్నను తమధైర్యము చెడకుండ
కృషికులుకార్మికులచ్చట తమతమపనులు నెఱపుచుండ్రి
తమబలములకుసహాయంబగుచును నిలిచినారువారు
బాంబులవృష్టియుగురియుచుండగనే మిల్లులునడమాడ్రా
శతఘ్నిగుండులు ధుముధుముచుండగనె సాగెనన్నిపనులు
స్కూళ్ళనుకాలేజీలనక్కడను కట్టిపెట్టలేమ
విద్యార్థులుసైతము సైనికులుగ మారిపోయినారు
ముప్పదైదులక్షలమానవులును లెనిన్‌గ్రాడ్‌నకును
నిలువబడిరి బల్‌కోటవోలె పగతురనడ్డగించి

వ॥ ఈవిధముగా ప్రజానిరోధమధికము కాపడమువలన, నిపుడు తాను దాడిసలుపుచున్న;

లెనిన్‌గ్రాడ్‌పై తమపరవళ్ళిక సాగవంచునెంచి
ఎల్లసేనలవిక్రమమంతట భీతిపర్వగాంచి
ఏమిలాభమికఎన్నాళ్లేడ్చిన పోదమంచుకదలి
మాస్కోతట్టుగ సాగసాగెను జర్మనుసైన్యములు
వచ్చెడుసేనలపెల్లుగాంచెను జర్మనుయోధులను
మాకతిథులుమీరందఱు రండిక మాస్కోదగ్గరను
స్థిరస్థాయులుగజేయుదుమిచ్చట భూస్థాపనజేసి
ప్రాణంబులఁబాలించిపోయిన మాపెద్దలయొద్ద
ధర్మనియమములు నేర్చుకొందురిక ముందునిందువలన
గోరీల్ మీకు మాస్కోకోటల బైటగట్టెదము
రారండీమీరందఱురండీ మాకతిథులుమీరు
లాజోనిస్కీయిట్లన్నాఁడు మచ్చరమ్ముబలిసి
ఎల్లదళంబులు మాస్కోలోనే విస్తరించిసిలచె
కొంచముకానివీరప్రతాపము పెచ్చుపెరుగగాను
చలముపట్టిరష్యనులు జర్మనుల మచ్చమాపినారు
పరివృతముపయినహిట్లరుసేనల గణనసేయకుండ
ఇన్నినాళ్ళనుండియు ధైర్యంబున రక్షిస్తున్నారు
అభ్యసించితిమి మీధైర్యంబును వీరవర్తనమును
లెనిన్‌గ్రాడునుఁ గాపాడండి చింతనవలబెట్టి
మాస్కోనెప్పటికేనియు పగతులచేతతగులనీము
నెపోలియన్ మునుమాస్కోజూచెను హిట్లరదియుగనడు
నిండుదండుతోరేపోమాపో పైబడిజర్మనులను
కండకండలుగ నఱికివేసెదము ఫ్రాన్కువిడవబోము
అన్నట్టులనేవిక్రమమ్ముగను పఱచిరష్యనులు
జర్మనుబంట్లకుమాస్కోగేటులె స్మశానములొనర్చె

అఖండదక్షత అఖండదీక్షయు నఖండశిక్షయును
కనపడజేసిరి రష్యాన్ వీరులు జర్మనులడలంగా
మాస్కోకోటల వెలపల సాగెను నల్లాళ్ళీలాగు
సీతువు బలసెను హిట్లరుపాలిటి పెనుభూతమువలెను
మంచుతుఫానులు మంచువర్షములు ఎల్లెడలనుగురిసె
భూమియంతటను మంచుపడుటచే నడుగుపెట్టరాక
శీతకాలమిదియిరుపక్షములకు ప్రతికూలంబయ్యెక్
మంచుపడుటచే టాంకులుసాగవు విమానములు పోవు
యంత్రంబులలోనొక్కటియైనను మెదలకుండునపుడు
కాలిబంటలేలాగునైనను ముందుకుపోలేవు
ఈచలికాలములో హిట్లరు ముడిచికొనిపండుకొనియె
అంతటంతటాతనిబలములు నొదుగుచువణంకజొచ్చె
త్రోవగనపడక వెదుకసాగె మునువచ్చినత్రోవలను
అవమానానలతప్తుని కెన్నగ చలియనగానేమి
ఆపతమేమివానయేమి యింకేదియైననేమి
రష్యాయోధులు యథాక్రమముగనె కలనుసల్పినారు
ప్రాణంబులపైనాసగల్గిన జర్మనులత్తరిని
వెనుజూపించిరిస్సైనికధర్మమునకు విరుద్ధముగను
రష్యాక్ సేనలడాకకునోడి వెనుకాడనోడంగి
పాఱజూచెననిజర్మనుసేనలు పరాభవమునొంది
హిట్లరుక్రూరుడు నేమనెననగా తనసేనలతోడ
రష్యావారికి చలికాలములో చలివేదన్నాడు
తనరాష్ట్రమ్మునసుఖమొక్కనికి కష్టమొక్కనికిని
రష్యాయందలి చలియట్లాగే ననియనఁకొన్నాడు
పారుకాడుతనదండుగౌరవము నిలుపుకొనుటకొరకై

డాబులనెన్నో చేసినాడచట జనమునమ్మకొరకు
రష్యన్ సైనికులేకధాటిగా హిట్లరుబలములను
పగునేనిమిదివందలమైళ్ళపొడవు వెనుకకుతరిమాడు

వ॥ ఈప్రకారము శత్రువులవెన్నంటి తరుముచు రష్యాసేనలు రాసోపును సమీపించినవి. అపుడుప్రజలేలాగున నున్నారనిన,

నిండుగుండెతో నిబ్బరంబుగా సంచరించినారు
గొరిల్లాలై వేటలాడిరి హిట్లరుసేనలను
హిట్లరుసేనలహరించినారు తుపాకిదొరకినను
విజయమందుటకు దారిచేసియుంచిరి నయమ్ముమీర
ఒక్కపట్టునొక్కపెట్టున నెట్టుసేనధుమికె
చానగమిగిలిననాదారబలము వెన్నిచ్చితొలంగె
రష్యావీరులునీప్రకారముగ ముందుకరగినారు
ఎల్లజనంబులిటువినండి మీరువీరులపండువుగ
జర్మన్ పాపులుక్రమక్రమముగను నమసిపోయినారు
తమసర్వస్వమురణరంగమునకు రష్యామానవులు
త్యాగబుద్ధితో ధారపోయు చున్నారుచూడుడింక
ఆర్యులమనివారేమియేడ్చినను అదినిజమ్ముకాదు
నమ్మబోకుడిమోసమొనర్తురు మందబుద్ధిగలిగి

వ॥ అదియునుగాక,

సంధిజేసుకొనునేమోధనికులు హిట్లరుతోడుతను
మీకర్తవ్యముజాగరితమెయిక్ నెఱవేర్చుకొనుండు
చాటిచెప్పుడీఘంటాపదముగ ధనికరాజ్యములతో
నశింపవలెననిపిశాచిహిట్లరు కోటికంఠములతో
బ్రిటనుపై నితమచేవైరమునో కల్పనజేసుకొని
రాజధర్మసంబంధములెఱుగక సంచరింపవలదు

జనసమంబిదిజనమోక్షమునకు కష్టపడగవలయు
మనుజాళినులనునాజీహంతకుల ద్రుంచివేయవలయు
ఎట్టివాడోహిట్లరు దానవుడేసుంతయయినగనుము
అలుకొనినజనప్రాణరుధిరముల నారగించినాడు
కండకండలుగచెండి పలలమును వండుకతిన్నాడు
బేలుకాడవురు, దోసకాడవురు బుధిపోటుపొంగ
కర్షకకార్మిక కష్టజీవనుల జట్టినణగద్రొక్కి
మతాధికారులజ్ఞానంతులను రాష్ట్రిమెకలగొట్టి
స్వయంనియంతృతస్వయంవివరణము యథేచ్ఛయుబోదల
కార్మికులంమరిస్త్రీలనుశిశువుల కమ్యూనిష్టులను
జాలిలేకయిటగాల్చిచంపెను కసాయివాడతడు
సొగసైనవనితలగుపడినంతనె బలవంతముజేసె
ఒకరికొకరుగాకుండ తల్లిబిడ్డలను దరిమినాడు
తెలివితేటలనుకలిపివేసెను వెలిబూడిదలోను
జనాభ్యుదయమును జనోద్యమములను అడ్డగించినాడు
ఆతనిదుర్మార్గలునింతంతని పలుకవశేముగాదు
లోకమంతయునుతల్లడపడియెను వానిక్రౌర్యములకు
ఆకారణమునవేజగమంతయు దిరుగుబాటునొందె
హిట్లరురాక్షసకృత్యంబులతో లోకమెల్లగెలువ
వేచియుండెనిన్నాళ్ళుదనుక నిటనిలిచిమూముకొనుచు
ఇత్తరిరష్యాజయధ్వనులతో తెల్లమొగముపెట్టి
పటాటోపముగభాషింపదొడగె ధైర్యంబెడబాసి

వ॥ ఇది యీలాగున యుండగా, ఇకముందుజరుగు చరిత్రమెటులున్నదనగా,

వినుడీభారతీవీరకుమారులు వీనులవిందుగను

జనఘాతకులౌ ఫాసిష్టులను గూలద్రోయవలెను
వారిజూచియలవాటుపడినది జపానురాకాశి
ఆసియరాష్ట్రములన్నియునొకటని జర్మనీకదసె
బుద్ధదేవువెంబడివారలమని కరవాలముదూసె
జనసమ్మతమునుగోరువారమని జనులజెయిలబెట్టె
భూమియందున్యాయము నిల్పెదమను స్త్రీలనుజెఱబట్టె
నిశ్చయమ్ముగానీతిజాతియును లేదుజపానునకు
పూనియుండెనుపరదేశమ్ముల నాక్రమించుటకును
ఆసియరాష్ట్రములొక్కటన్నియని వక్కాణించుచుండె
చీనాదేశపుస్త్రీలబాలురను చక్కాడుచునుండె
బౌద్ధనీతులువచించుచున్న జనులగొంతుదునుము
ధర్మపద్ధతులగరపెడిస్త్రీలను బలాత్కరించుచును
ఈలాగున్నదిజపానుదేశపు దుష్టవర్తనమ్ము
అక్కడకూడానంతవంతను బేరంముదిరింది
జపానులోధనవంతులయాసలు వృద్ధియగుచునుండె
పెత్తనమిచ్చిరిటోజోగారికి ననుకూలుండనుచు

వ॥ అప్పటికేజపాను నాలుగేండ్లనుంచి చీనాదేశంమీద దాడెత్తి ఘోరముగా సంగ్రామముచేయుచున్నది. చీనాసేనలు జంగ్కైషేక్ నాయకత్వాన, ఏకోన్ముఖముగా నెదిరించినారు. జపానుమారణ శక్తులను ఈనాలుగేండ్లనుంచి చీనాయోధులు ప్రతిఘటించుచున్నారు. జపానునాశనమయ్యేదాకా, చీనాప్రజ లదే విధముగా ప్రతిఘటించుచు నుందురు. మంత్రియగుటోజో యేమిచేసెననగా, తమకేవో కావలయు నని అమెరికాకు రాయభారముపంపించెను.

సంధిబేరములుచేయుచునుండిరి యచటనమెరికాలో
నిద్దురవేళనునద్దమురాతిరి నాజపానుటోజో

ఎవ్వరెరుగకుండ నువ్వెత్తుగ దండయాత్రసలిపె
సాగిరమంతయు యుద్ధనౌకలతో నింపివేసినాడు
విమానములతో విద్యుత్తంతయు గప్పివేసినారు
నౌకాబలములు విమానబలములు నొక్కసారిసాగి
అవ్వాలనివ్వాల నైదువేలమైళ్ళావరించినాయి
జపానువారపుడేమిచేసెను తుపానుమాదిరిగ
లంకలవంకలదద్దుదింపెను చుట్టుపట్టులగల
గొప్పసేనతోతాయిలాండుపై విరుచుకపడ్డాడు
ఫిలిప్పైనలుహవాయిలంకలు అలుముకొనగదలచి
నౌకాబలములవిమానబలముల గూడివచ్చినారు

వ॥ ఆసమయంలో జపాను పెద్దమనిషితనాని నమ్మి యున్న అమెరికా బ్రిటనులు నివ్వెరపోయినవి. ఇంతఅధార్మికంగా జపానుదండయాత్రచేయుననుకోలేదు. జర్మనీ రష్యామీందపడ్డవిధముగా జపా నొక్కపెట్టుగా ననేకద్వీపాలమీానపడ్డది. అమాయకులైన స్త్రీలనుపురుషులను విమానదాడులతో హతమార్చినది. ఎక్కడచూచినను ప్రజల హాహాకారాలు ఆక్రందనాలు చెలరేగినవి. అమెరికావారు, బ్రిటిష్ వారు తెలిసికొన్నవెంటనే తమశక్తికొలది జపానును ప్రతిఘటించడము మొదనుపెట్టిరి, దెబ్బకుదెబ్బకొట్టిరి. శత్రువును విశేషముగా నష్టపరుచుచున్నారు. అయినప్పటికి అప్పుడే జపాను మలయాను ఆక్రమించినది. సింగపూరునపట్టుకున్నది. పిలిప్పైనులలో చాలాదీవులను స్వాధీనము చేసికొన్నది. సుమిత్రా, బోర్నియో, జావా మొదలైన ద్వీపాలను మెరపుమెరసినట్లుగా నాక్రమించినది. ఈదేశాలలో ప్రతిపట్టణానిని ప్రతిగ్రామమును స్మశానభూమిగమార్చివేసినది. చివరకు బర్మాలో రంగూనును కూడనాక్రమించినది.

పిడుగుపడినయటుమెరపుమెరసి నటు లన్నిరాష్ట్రములను
ఒక్కపెట్టుగానఅముకొనుటకయి యటజపానుచూచె

ప్రజలందరునిట్లనుచున్నారు ఏక మొత్తముగను
వినుడీమీరు విడుడీమీరు వాని హేతువులను
బర్మా మలయాఫిలిప్పైనులు దాస్యవృత్తి వలన
నిర్వీర్యములై చీలిపోయినవి నీరసంబుచేత
తమదేశమ్మనుమాటమరచిరి నిరాశజెందినవి
ఈతీరుగదేశమ్ములుండగ బ్రిటిష్‌సైన్యబలము
వైరిసైన్యములనిలువరించెను చాలవరకుదాను
ఆరాజ్యంబులయందుజపాను ఏమిచేసెననగా
ఇండ్లలోజొరబడిసంపదలను కొల్లగొట్టెనెల్ల
చెఱలబెట్టెనుస్త్రీలనుబట్టుక జాతినీతి లేక
కూడదనినచో కరకుతుపాకులు గుండెలానినిలుచు
కూడదనినచోఉరికంబాలు ప్రత్యక్షములగును

వ॥ జపానుసేనలు అనేకతొందరలు కలుగజేయును వారే బహునీతిపరులవలె.

ఈమాదిరిగాబాధించారు మనుజులనందరిని
ఈలాగునఖేదింపజేసిరి జనములనందరిని
ఆశలేనితనమసహాయతయును పోటమున్నలేమి
తమపరాక్రమముహరించి పోవుటవల్లశాత్రవులను
ఈయిక్కట్టులననుభవించిరి ఆపలేకతుదకు

వ॥ ఇట్టిస్థితిలోబాగా నిదానించిచూడగా మనముచేయదగినది యేమున్నది కష్టకాలముననను విజ్ఞానంబున నిస్పృహత్వమును ఒమగ జేయవలెను. సామర్థ్యంబున నిరాయుధత్వము పారగొట్టవలెను.

మనలోమనమేకలనుజేయవలె ధైర్యముపొంగార
పరులస్వార్థములనుద్ధరించుటకు పోరాడుటకాదు

మనజ్ఞానంబునుమనసమస్తమును మనమర్యాదయును
మనస్వాతంత్ర్యమువిన్నవించు కొనదలచిపోరవలెను
ముందుకురండీ! ముందుకురండీ! వేయుడురణభేరి
తుపాకిచేగొనిజయధ్వానములు సల్పుచునడువండి
అందరొక్కమొత్తముగరణమునకు సాహసించిచనుడు
స్వరాజ్యమునురక్షణచేయుటకై ఎదుటకునాగండి
మనయుద్యమమునుమనరాజ్యమును నెరవేర్పగనిలుడి
పందతనమ్మున వెన్నీయకుడీ! ముందఅనిలునండి
రష్యాయోధులయుద్ధసాహసము మనసుననిలుపండి
స్టాలిన్ వీరునిశాంత్యుపదేశము మరువకదలచండి
భూలోకములోప్రకృతముగన్గొన రష్యాదేశమ్ము
స్వర్గభువనమునుసకలసుకమ్ముల కాటపట్టుసుమ్ము
అటనల్పుడనియుగొప్పవాడనియు గననగానబడదు
కూటిపేదయనికోటీశ్వరుడని తలంపులేలేవు
కుడువకూడును తొడుగగుడ్డయును లేనివాడులేడు
ఉండనిల్లునుపరుండగమంచము లేనివాడులేడు
రామరాజ్యమై ప్రకాశించెను రష్యారాజ్యంబు
రామరామశ్రీ రామారామా రామారఘురామ॥

సర్వేజనోసుఖినోభవంతుః

సమాప్తము

---

శ్రీ ర స్తు.

# ఆంధ్రరాష్ట్ర ప్రబోధము.



## ఆ క ప ద ము.

పల్లవి॥ హరిహరీ నారాయణ । ఆదినారాయణా
కరుణించిమమ్మేలు । కమలలోచనుండా!
శ్రీరామరఘురామ । శ్రీమహాగుణధామ
శత్రుకోటివిరామ ! జగదభిరామ
ఆర్యపూజితులైన । ఆంధ్రమహాజనులార
ఆంధ్రరాష్ట్రకథను । నాలింపుడీరు॥
శ్రీమంతమైలోక । శేముషీవిభవమై
ఎసగుచునుపూర్వమున । హిందూదేశంబు॥
కలదుతూర్పునబం । గాళఖాతంబు
హిందూమహాసముద్ర । మెలమిదక్షిణమున
పడమటికనుమలు । పడమటంగలవు
మంచుకొండలుగలవు । మరియుత్తరమున॥
భరతఖండములురెండు ! భాగములుగాగ
వింధ్యపర్వతపంక్తి । విడదీయుచుండె॥
త్రైభుజాకృతినున్న । దక్షిణాపదమున
తూరుపుకనుమలకు । తోయధికినడుమ।
మైదానమున్నది, స ! మంబైననేల
గౌతమీ కృష్ణ తుం । గభద్రానదులు।

జీవనదు లెంతో, ప్ర । సిద్ధిగాంచినవి
పంటలకునుగొప్ప । వర్తకంబులకును॥
రాకపోకలకును ని । రాఘాటమగుచు
వాసిగాంచినవి యీ । భవ్యంపునదులు॥
వెలయద్రాక్షారామ । భీమలింగంబు
శ్రీశైలమున, మ । ల్లేశలింగంబు॥
చెన్నొందుశ్రీకాళ । హస్తీశలింగంబు
ఆత్రిలింగముల, మ । ధ్యస్థమండలమె
త్రిలింగదేశమనియు । తెలుగువాడనియు
ఆంధ్రదేశంబంచు । నంద్రుమనవారు॥
మరిరెండుజిల్లాలు । మైసూరునందు
ఎనిమిదినైజాము । ఏలుబడియందు॥
ఆంగ్లపాలమునం । దమరుపదమూడు
మధ్యరాష్ట్రమునందు । మరినొంతభూమి॥
ఓఢ్రదేశమునందు । యున్నదిమరికొంత
అంతయులక్షమై । ళ్యాంధ్రదేశంబు॥
తెల్గునాటనుగల్గు । తెల్గువారెల్ల
కొంచమించుగమూడు ! కోటులున్నారు॥
ఒకకోటిరాష్ట్రాంతర । ములనున్నారు
ఖండాంతరములందు । గలరొక్కకోటి॥
ఆంగ్లపాలననున్న । ఆంధ్రులధనంబు
ఆరుకోటులువచ్చు । ఆదాయమేటేట॥
అరవలుకోటిన్న । ననుభవింత్రుమేటేట
ఆంధ్రులైక్యతలేక । అరవమాయనుమున్ను॥
అడియేనుదానంద్రు । అరవవారలకు

ఆంధ్రదేశమునాది । ఆంధ్రుడనునేను॥
ఆంధ్రులునావార । లతిపురాతనులు
ఆంధ్రవీరులరక్త । మతివెచ్చదనము॥
ఆంధ్రులశౌర్యాగ్ని । యనగదావాగ్ని
ఆంధ్రులధైర్యంబు । అద్రిసదృశము॥
ఆంధ్రులసాహసం । బనుపమానంబు
ఆంధ్రులప్రభుభక్తి । ఆజిలోశక్తి॥
ఆంధ్రులనేరుపు । అంత్యయమోరుపు
ఆంధ్రులభుజశక్తి । హస్తికపుభక్తి
ఆంధ్రులరాజ్యాంగ । తంత్రప్రశక్తి
ఆంధ్రులవిజ్ఞాన । మాంధ్రులకళలు॥
నలువచిలువలకైన । నలవియేపొగడ
విశ్వవిఖ్యాతమై । వెలిగినమనప్రతిభ॥
వేరెరాష్ట్రములేక । నీరసించెనుగా
మనతెలుగువారిలో । ఘనులవినరయ్య॥
రారాజులై బహు । రాణకెక్కిరిగా
మతకర్తలుదయించి । మహికీర్తిగొనిరి॥
మతమువ్యాపనజేసె । మహిమవిలసిల్ల
గ్రంధరచనలుజేసి । గనిరిప్రఖ్యాతి॥
కళలనువెలయించి । గనతనుగనిరి
మహామంత్రులై లోక । మన్ననలగొనిరి॥
వీరులై శూరులై । విఖ్యాతిదనిరి
ధీరులై విజ్ఞాన । శూరులై వెలసిరి॥
దాతలై ధైర్యంపు । పూతలైయుండ్రీ
భోగులునుయోగులును । పుణ్యులునుగలరు॥

గాయకులుపాటకుల్ । కవివరులుగలరు
మల్లులునాయకుల్ । మాన్యులునుగలరు॥
అతిప్రాచీనులగూర్చి । అబ్బురపడనేల
మొన్న మొన్నటివార । లున్నారువినుఁడీ॥
గోపాలకృష్ణయ్య । ప్రాపుగలనాయకుడు
కందుకూరివీరేశ । కవిచక్రవర్తి॥
విశ్వదాతాంధ్రావని । వితరణశీలుండు
కోవిదశ్రేష్ఠుండు । కొమరరాజు బుధుడు॥
బ్రహ్మర్షిరఘుపతి । పతితపావనుడు
కోడిరామమూర్తి । గొప్పయినమల్లుండు॥
అల్లూరిశూరుండు । ఆంధ్రధీరుండు
ధీశాలిసుబ్రహ్మణ్యం । దేశనాయకుడు॥
యడ్లరామదాసు । ఆంధ్రభక్తుండు
ఆంధ్రకళాచార్యుఁడా । రామరావు॥
న్యాపతిసుబ్బారావు । న్యాయైకదక్షుండు
అన్నదానమునందు । యశముగడియించె॥
సీతమ్మప్రఖ్యాత । నీతిప్రపూత
బండారుఅచ్చమ్మ । ప్రఖ్యాతికవయిత్రి॥
వేదాంతకమలమ్మ । విజ్ఞానపేటి
మాగంటిఅన్నపూర్ణ । మానినీతిలకంబు॥
గిడుగురామమూర్తి । పిడుగువాఙ్మయమున
చిలుకూరిపండితుడు । శేముషీవిభుడు॥
రాజగోపాలరావు । తేజంపుప్రోవు
పానుగల్ భూపతి । ప్రతిభగలనేత॥
కొచ్చర్లజమీందారు । కోవిదమందరయ

మోచర్లరామచంద్రుడు । మోలైనసరదారు॥
సి. వై. చింతామణి । స్థిరప్రజ్ఞపరుడు
వావిలికొలను తెల్గు । వాల్మీకిమహాత్యాగి॥
తెలుగువాటికిపీరు । వెలుగుతై విరసిల్లి
స్వర్గస్థులైనారలీ । శతాబ్దమునందే॥
కలరుయిప్పుడుగూడ । ఘనులుమనలోన
ధీవిశాలతనారి । తేరిసర్వత్ర॥
ఆంధ్రబిజ్ఞానంబు । నాద్యంత మెఱిగిన
గుట్టయినప్రగడ । పట్టాభిరామయ్య॥
అవ్యదిగ్గజముల । కంఖశెమ్మైన
అసమానధీశాలిమ । నయూంధ్ర కేసరి॥
శౌర్యసాహసమూర్తి । శ్రీసాంబమూర్తి
దండిగలసరదారు । కొండవెంకటప్పయ్య
రాణగలమేధావి । రాధకృష్ణయ్య
రాఘవేంద్రచౌదరీ । రాజ్యాంగవేత్త॥
ప్రతిభాధనుండు । రామలింగిరెడ్డి
ముత్త వేంకటసుబ్రావు । బుద్ధికుశలుండు।
విజ్ఞానసాగరుడు । విశ్వేశరయ్య
విమలప్రజ్ఞాశాలి, కూర్మ । వెంకటరెడ్డి।
గంత్రైనయోధుండు । గద్దెరంగయ్య
అబ్బురపుధీశాలి । బొబ్బిలీభూపతి॥
మేలైనసరదారు । శ్రీకోటిరెడ్డి
చల్లపల్లిరాజు । జనలోకమిత్రుండు॥
రామచంద్రారెడ్డి । రాణగలవాడు
విద్యలకుభోజుండు । పీఠికాపురనేత॥

మాగంటినాయకుడు । మహితవిజ్ఞాని
కల్లూరిసుబ్రావు । గండుదేరినయోధుడు॥
గుమ్మడిదలవారు । కోదమసింహంబు.
రాయసమువారు । రామచంద్రునివారు॥
వేమవరపువారు । విజ్ఞులాంధ్రమున
తెలుగునాటికివెలుగుకర్తరుడు జగజ్జెట్టి । మద్దూరి అన్నపూర్ణయ్య॥
గోపాలరెడ్డిబహదు । కోవిదశ్రేష్ఠుండు
వి. వి. గిరిమంత్రి । విమలయశుండు॥
ఆచార్యరంగా । అసమానధీశాలి
మొసలికంటినాయకుడు । అసదృశచేటి॥
పట్టడంగి కేశవుడు । ప్రజ్ఞాధురీణుండు
వెన్నేటినాయకుడు । విమలకార్యకర్త॥
తెన్నేటిసరదారు । ధీరవిజ్ఞాని
బి. యస్. మూర్తి । పేర్గొన్నవిభుడు॥
భరతనాట్యాచారి । నరసింహారావు
అయ్యంకివేంకటరమణయ్య । అయ్యదేవరవారు॥
హరిసర్వోత్తమరావు ! లధికులై వెలయు
గొల్లపూడిశాస్త్రి । కోవిదశ్రేష్ఠుండు॥
వేపారామేశంబహదు । విజ్ఞానఖని
వెంకటాచలశ్రేష్ఠి । వెన్నెలకంటివారు॥
ఆత్మకూరివారు ! అశ్సదృశఘనులు
మాధవపెద్దివారు । మారేమండవారు।
మల్లంపల్లివారు । మాన్యులై వెలయు
భావరాజువారు । ప్రజ్ఞావిశారదులు॥
శరజరామస్వామి । సాహసపరుడు

నెమలిపట్టాభిరామయ్య । నేర్పరై నసరదారు॥
సూరయ్య, అనంతశయనులు, శూరులాంధ్రావని
ఆంగ్ల దినపత్రికలను । ఆంధ్రవ్రాయసకాండు్ర॥
ప్రధానసంపాదకులై । ప్రబలుచునుండి
బోడపాటిరామన్న ప్ర । బుద్ధుండు ధీరుండు॥
దక్షిణాదాంధ్రులలో । నక్షత్రమై వెల్గు
సాధువరదరాజు । సారమేధావి॥
గణపతిపంతులు । కార్యంపుమేటి
అనేమహారాష్ట్ర । మంమనాయకుడు॥
అరటిపల్లినారా । యణరావుధీశాలి
పుష్నంరాజువేంకటశేషయ్య । పూరితవిజ్ఞాని॥
సురవరంప్రతాపరెడ్డి । సూరిజనస్తుతుడు
మాడపాటిహను । మంతరావు విజ్ఞాని॥
సరోజనీదేవి । శాంభవీనమురాలు
దుర్గబాయమ్మ । దుర్గాంబయేనిజము॥
కామేశ్వరమ్మ । కార్యంపుకర్త
బత్తులకామాక్షమ్మ । ప్రజ్ఞాధురీణ॥
ఆంధ్ర దేశమెకాక । అన్ని రాష్ట్రములందు
ధీరులునుశూరులును । తెలుగువారుండె॥
ఖండాంతరంబుల । గలతెల్గువారలు
బహుజననాయకులై । ప్రబలుచునుండె॥
రష్యాదేశమునందు । రాజకీయపువేత్త
వై మానికాధ్యక్షుండై । వరలుఆంధ్రుండు॥
యిట్టిఆంధ్రప్రతిభ । ఎట్టిగొప్పయులేక
వేరరాష్ట్రములేక । నీరసముపడియె॥

ఉత్తరాంధ్ర దేశ । మోద్రములుకలుపుకొనగ
దక్షిణాంధ్ర దేశం । ద్రావిడులదను నుండ॥
చెన్నపురితిరుపతులు । చేర్చుకోనరవలు
పన్నాగములు పెక్కు । పన్నుచున్నారు॥
కన్నడులుబళ్లారి । కబళింపనూహింప
ఛిద్రమైభిన్నమై । చెడనున్న దేశమును॥
వేరేరాష్ట్రముగాగ । విడదీయనెంచి
వెంకటప్పయ్యబూని । వివిధయత్నముజేయ॥
ఆంధ్రనాయకులుకొంద । అండగానిలువ
బయ్యానరసింహేశ్వరశర్మ. స । భాపతిగాగ॥
పదితొమ్మిదివందల । పదమూడువత్సరమున
ప్రథమాంధ్రమహాసభ । బాపట్లలోజేసె॥
పెక్కంద్రుమాట్లాడి । పెక్కుతీర్మానములు
గావించి, ఆరీతి । గడుపుచునుండి॥
పందొమ్మిదివందల । పరగనలుపై యొక్క
సంవత్సరమునకు । సభలుయిరువై యొకటి॥
చేసిరిరువుదేండ్లు । చెల్లినప్పటికి
ప్రత్యేకరాష్ట్రమని । పలవించిరాంధ్రులు॥
కవికుమారులురాష్ట్ర । గానముల్ చేసిరి
రాయప్రోల్ కవి, రాష్ట్ర । రాగమాలాపింప
విశ్వనాథమువారు । వీరులనుజూప
జాషువాకవి తెల్గు । జావళీల్ బాడంగ॥
తుమ్మలపల్లిచౌదరీ । కమ్మనిభాషలో
రాష్ట్రగానముప్రాసె ॥ రాణదేరించె॥
పసిడితునకలవంటి । పసగలపద్యాలు

కోసరాజుచౌదరి । విసరెసర్వత్ర॥
ఆంధ్రభూమికినేత । ఆంధ్రకేసరి
చెన్నపురిగుట్టు । చెప్పెవివరముగ
పండితసుబ్రమణ్యం । ప్రబుద్ధాంధ్రలో
తెలుగువిజ్ఞానంబు । వెలుగంగజూపె॥
ఆంధ్రపత్రికయును । ఆంధ్రప్రభయును
ప్రత్యేకరాష్ట్రంబు । వ్యాసమునిచ్చె॥
జనవాణికాగడాల్ । ఘనముగాబనిచేయు
ఆంధ్రవిశారదబిరు । దాంకితుండునిలుప॥
ప్రజామిత్రద్వారా, రామ । బ్రహ్మముపనిచేయ
అబ్బురముగవిశాలాంధ్రలో । గొబ్బూరిజూపింప॥
పసుకురెడ్డివీర । భద్రస్వామిపూని
మాతృసేవపత్రికద్వారా । మహితపనిచేయు॥
మల్లిడిసత్తిరెడ్డి । మంచిప్పుడలతో
రెడ్డిరాగిద్వారా । దొడ్డగాపనిచేయ॥
ఆంధ్రనాయకత్రియము । అండగానిలువంగ
వెంకటప్పయజేసె । వివిధయత్నములు॥
పద్రంగికేశవుడు । పట్టుబట్టంగ
మొసలికంటినాయకుడు । కసిబట్టియుండ
గుమ్మిడిదలవారు । తొమ్ముచరచినిలువ
కల్లూరిసుబ్రావు । కార్యాలుజరుప॥
చల్లపల్లిరాజు । యుల్లాసముననిలువ
దక్షిణాంధ్రులు । ధైర్యమునపనిజేయ॥
హైదరాబాదీంధ్రులు । లండయైనిలువ
బహుళాంధ్రజనులెల్ల । పనిచేయుచుండ॥
వేరేరాష్ట్రంబు । విడదీయరాదంచు
అడ్డులుకల్పించువార । నాలింపుడయ్య॥

అరవరాజాజీకి । అడియేనుదాసందు
అయ్యదేవరవారు । అక్కనతగిలారు॥
గోపాలరెడ్డిత్రా । గొప్పపదవినిగోరి
శ్రీమానులకభి । షేకముల్ జేయు॥
రాయలసీమందు । రాద్ధాంతములుపన్ని
రామలింగారెడ్డి । రాగాలుదీయు॥
కృష్ణాపత్రికతొల్లి । కీర్తులనువిడనాడె
ప్రత్యేకరాష్ట్రింపు । పనిచేసేపనిచేసి॥
విసిగితిమనికూర్మ । విభుధుండుపల్కు
పట్టువిడిచినదాని । పట్టరాదికనంచు॥
బొబ్బిలిభూపతి । బొబ్బలువైచు
నన్నంటుకోకమ్మ । నామాలకాకంచు॥
తెలుగుజమీందార్లు । తిరుగుదురుతేవ
పరిసరంబులవారు, తెల్గు । భాగమాత్రకుంచు॥
గతితప్పితెలుగుతల్లి । కంపింపసాగె

వ॥ ఆంధ్రరాష్ట్రాభిమాను లాంధ్రమాతయొక్క నిరాధార స్థితి గతి 1941 సం॥ నవంబరు 22 వ తేదీని విశాఖపట్టణమున 28 వ వార్షికోత్సవము 22 వ ఆంధ్రమహాసభ గావించ సమ్మతింపగా- 'బుద్ధి విభ్రాజులకు భూషణిరాజు ,వెంకటపతిరాజుగారు ప్రారంభోపన్యాసకులు గను, రాష్ట్రాభిమానులు మద్ది పట్టాభిరామిరెడ్డిగారు సన్మానసంఘాధ్య క్షులును, విద్యన్యవిరాజులు, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు మహాసభాకార్యదర్శులును, గణ్యాగుణగణ్యులు కంచెర్లరామబ్రహ్మము గారు కోశాధికారులుగను విబుధగిణగుణగేయులు విన్నకోటమర్గారావు సోదరులు మల్లిఖార్జునరావుగారు ఆహ్వాన సంఘకార్యదర్శులుగను, సన్నుతగుణాలంకార భూషణులు వుప్పల వెంకట రామారావు, యం. ఆర్. డీ, పోట్నూరిబాబుగార్లు సహాయ కార్యదర్శులుగను, సమ్యద్గణకీర్తి బి. సదానందమూర్తిగారు రాష్ట్రేతరాంధ్రసభా అగ్రనేజ రుగను-సర్వాంధ్రదేశీయులచే సమ్మతింపబడియెను. ఆమహాసభను—

ఆంధ్రావనికెల్ల । నలంకారప్రాయంబై
పూర్వంబునుండియును । పొల్పుగాంచుచును
వినుతకీర్తులుగొన్న । విజయనగరమును
పాలించుపూసపాటి । ప్రభువంశమందు॥
రంజిల్లప్రభవమై । కాశీరాజ్యమునేలు
మహారాజకుమార్, సర్, కె. టి. । యం. యల్. విగారు॥
విజయానందగజపతి । రాజబహదూర్
వర్యులనధ్యక్షు । వరులగావించె॥
సభనుగావించిరి । శాస్త్రినిగతిదోడ
బర్మా బొంబాయి హైదరా। బాదులనుండి
తమిళ, కన్నడ, ఓడ్ర । స్థానములనుండి
ఆంధ్రప్రతినిధులేడునూ ! ర్లిరువై మంది
వచ్చిరాంధ్రనాయకులు । వచ్చిరిచాల
దేవేంద్రసభవోలె । దేదీప్యమైవెలుగ
ఆంధ్రమాతతాగాంచి । ఆనందమొందె
విశాఖపురవాసులు । వేడ్కసన్మానములు
జరిపించెయావదాంధ్రులు । సంతోషపడగ
అట్టిసభాధ్యక్షు । డాంధ్రమాతయొక్క
పుణ్యతపఃఫలము । గణ్యగుణశాలి
విజయానందగజపతి । విజ్ఞానవాక్సుధను
సభికులతనివారు । ఛాయగురిపించె
ప్రత్యేకరాష్ట్రంబు । పనిబూనితెచ్చుటకై
దీక్షకంకణమూనె । దిశలుహర్షించ
ఆంధ్రకేశరిఘూర్జ । నంబాలకించి
విజయవంతముగనుసభా । వృత్తులుముగించె
అమీదసభాధ్యక్షు । లాంధ్రావనికెల్ల
సంచారమొనరించి । సంగతులనెఱింగి

చెన్నపురిగవర్నరు దరి । జేరివేర్వేర
రాష్ట్రవిభజనకార్య । రకములవచియించె
గవర్నరుగారితో । గాంధీగారితోడ
జయమొప్పసంభాషనల్ । జరుపుచునుండె
నాయకుల్తోడ్పడ యీ । నాయకశిఖామణి
సర్వాంధ్రమండలము । సవరింపవలెనిట్లు
చెన్నపురంబుహోసూరు । సేలంబులు
కంచిసైదాపేట । కలుపంగవలయు
పొన్నేరుకృష్ణగిరీ । పూత్తిగాబళ్ళారి
కోలారుతుంకూరు । కూర్పంగవలయు
ముడిచిత్రదుర్గంబు । మరితిరువళ్ళూరు
బెంగ్లూరుజిల్లాలో । పెద్దయినవంతు
పర్లాకిమిడిబరం । పురం,జయపూరు
చాందాయులోంటి । వైజాగుపట్టులును
బస్తరుఖంగేరు । పరగణాలునుహైద
రాబాదుపురి । అజింతాలయములు
నెల్లోరనైజాము । నెసగుతెలుగునేల
చేరిముఖ్యనగరు । చెన్నపురిగాగ
కంచిబరంపురములు । కడహద్దులైయుండ
బహుళాంధ్రరాష్ట్రాల సౌ । భాగ్యమైవిలసిల్ల
పూర్వవిజ్ఞానమహిమంబు । పొల్పుగాంచెనట్లు
వెలయుసంపూర్ణమై యీ । తెలుగుతల్లి
ఆంధ్రులాహ్లాదమున । హారతుల్బట్టుచు
జయ్ఆంధ్రమాతజయ్ । జై యగుగాక!

సంపూర్ణము.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B180 |
| పుస్తకం పేరు | వేటి ప్రపంచ యుద్ధము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |